శ్రీ

# దుర్గా వైభవము

దుర్గా సప్తశతి ననుసరించి



రచన :

"శరవణ"

శ్రీ

# దుర్గా వైభవము

## దుర్గా సప్తశతి ననుసరించి



ఈ గ్రంథం తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ఆర్థిక సహాయముతో ముద్రితము


రచన

**"శరవణ"**

(K. సుందరరావు)

ప్రథమ ముద్రణ - [illegible] - 1000 కాపీలు

This book is published with the Financial Assistance of "Tirumala Tirupati Devasthanams" under their scheme aid to publish religious books.



మూల్యము : 10-00

లభించు చోటు

విద్వాన్ కె. సుందరరాజు, ఎం.ఎ., ఎం.ఇడి.,
ప్రధానోపాధ్యాయుడు
M PP.U.P School
వరదయ్యపాళెం, చిత్తూరు జిల్లా - 517 541

*Printed at :*
శ్రీ ప్రింటర్స్, తిరుపతి.

అంకితం

# అమ్మ కు

యాదేవీ సర్వ భూతేషు
మాతృ రూపేణ సంస్థితా
నమస్తస్యై నమస్తస్యై
నమస్తస్యై నమో నమః

ఓంకార పంజరశుకీ ముపనిషదుద్యానకేళి కలకంఠీమ్
ఆగమ విపిన మయూరీ మార్యామంతర్విభావయే గౌరీమ్

శ్రీవిద్యాం జగతాం ధాత్రీమ్ సర్గస్థితి లయేశ్వరీమ్
నమామి లలితాం నిత్యామ్ మహా త్రిపురసుందరీం

యాదేవీ మధుకైటభాది దలనీ
        యామాహిషోన్మూలినీ
యాధూమ్రేక్షణ చండ ముండ మథనీ
        యారక్త బీజాశనీ

శక్తి: శుంభ నిశుంభ దైత్య దలనీ
        యా సిద్ధి ధాత్రీ పరా
సాదేవీ నవకోటి మూర్తి సహితా
        మాంపాతు విశ్వేశ్వరీ

సర్వ మంగళమాంగల్యే శివేసర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే

## గురుస్తుతి

శ్రీ దుర్గా దివ్యలీల చింతించుచు పరవశించి
'దుర్గా వైభవము' బాడ దొరకొను చుంటిన్

మాతా పితృదైవతముల మది సీతాలక్ష్మమ్మను
శ్రీహరిరావు [illegible] చేతు నంజలుల్

ఆది కావ్య రచన నలిపి యవనికి రామామృతమును
బంచిన వాల్మీకి ఋషిని భక్తి దలతును

ఆగమముల విభాగించి యష్టాదశ పురాణముల
వ్రాసిన వేదవ్యాసుని భక్తి దలతును

నన్నయ తిక్కన ఎర్రన నాచన సోమన పోతన
శ్రీనాథాదుల కవులను చింతింతు నెదన్

అద్వైతము ప్రవచించిన యాది శంకరుల భగవత్
పాదుల గురు పరంపరకు ప్రణమిల్లెదను

నా మదిని దలంతు చెంచు రామయ్యను జానకమ్మ
నంబ పదయుగమ్ము జూపి నందుకు భక్తిన్

భక్తి దీపము వెలిగించి బ్రతుకు సార్థకము చేసిన
గురు జనులకు వినయమ్మున గూర్తు నంజలుల్

## ఇష్టదేవతా స్తుతి

శ్రీకరముగ షోడశాక్షరీమంత్రము జప మొనర్చు
భక్తుల గాచెడు లలితా ప్రణతుల గొను మా!

అఖిల లోకములను గాచు నాది లక్ష్మి సాటిలేని
నీ మహిమలు నాదు మదిని నిలిపి యుంచుమిా

శారదాంబ! పలుకు తేనె లూర జేసి పాఠకులకు
మోక్ష మొనగు బీజాక్షర ములను నిలువుమా.

సృష్టి కర్త! ప్రాణి శిరో రేఖా లేఖన తత్పర!
ఈ జీవికి 'గీత' మారు టెన్నడు తండ్రీ

చిన్న నాటి నుండి భక్తి చివురింపగ జేసిన శ్రీ
నారాయణ! వేంకటేశ! నను వీడకుమా!

అనుదినమ్ము నేను నలువు నరకోర పూజల గొను శివ!
నీకరుణా గంగా ఝురి నింపుము మాపై

వేల్పులందు మేటియైన విఘ్నరాజ! చిరుకబ్బము
నిర్వహింప వెంట నంటి నిలిచి యుండుమీ

తత్స వితృ వరేణ్య భర్గ దైవతాన్యనుదీ మహిత!
ధియః యోగములను ప్రచో దింపు మా దయన్

వివిధరూప నామంబుల - వివిధ పుణ్యభూములందు
వెలసియున్న కనకదుర్గ వేడుకొందును

పంచ భూతములకు లోక పాలకులకు కేలు మోడ్చి
భవ్యమైన దేవి చరిత పాడు కొందును

శ్రీకరమగు దేవి పూజ జేసి మోక్షమంద గోరు
భక్త జనులు 'దేవి చరిత' పాడగా దగున్

స్వారోచిష మన్వంతర సమయ మందు చైత్రవంశ
మున సురదుండనెడు రాజు జనన మందెను

అభిషిక్తుండై సురదుం డౌదార్యము తొడవు గాగ
కన్న బిడ్డలట్లు ప్రజల గాంచు చుండెను

నెలకు మూడు వానలతో నేలయు దున్నక పండెను
కరువు కాటకములు లేవు సిరులు పెరిగెను

సుఖ శాంతులు వర్ధిల్లెను శుభ కర్మలు వృద్ధిజెందె
సుభిక్షమై యుండెనవని సురదు దేలగా

కువలయపతి శత్రువులగు కోలా విధ్వంస పతులు
ఉరుము లేని పిడుగు పాటు కరణి దాకిరి

సాహసమున పోరి తనదు సైన్యము రణమందు మడియ
దైవ ఘటన సురదు డోడి తరలె పురికిని

సురదు డూర లేని యపుడు పరమ దూర్తు డతని మంత్రి
యదికారుల తనకు వశం వదుల జేసెను

అతని చేతి కీలు బొమ్మ లైన రాజపురుషులెల్ల
సురదు బట్టి హత మొనర్ప జూచుచుండిరి

వారి దుష్ట బుద్ధి నెరిగి మారు వేషమున సురధుం
డశ్వమెక్కి యొంటరిగా నడవికేగెను

సహజ వైరములను మాని సఖ్యతతో జంతుతతులు
సంచరించు వనముగాంచి సంతసించెను

ముని వరుడగు మేదస ఋషి తనదు శిష్యజనుల గూడి
వసి యించెడు నాశ్రమ మా వనమున గలదు

సిరులు దొరగ తిరిగి తిరిగి నరవరుడా యాశ్రమమును
గాంచి - దీనుడై - మేదసు కడకేతెంచెన్

వేద విదుండైన మునికి వినతు డగుచు తనదు చరిత
విన్నవించి యతని శరణు వేడు కొనియెను

ఆ ఋషి వరు డాదరమున నూరడించి యభయమొసగి
యాతిథ్యము నిచ్చి నిలిపె నాశ్రమమ్మున

ఆ ప్రశాంత పరిసరాల నాగమ చర్చలు వినుచును
తనదు చింత మరచి రాజు తనిసి యుండెను

ఒక్కనాడు సురదుడు తా నొంటరిగా నున్న వేళ
తన రాజ్య స్థితిని గూర్చి తలచె నీవిధిన్

"దుష్టుడైన మంత్రి దర్మ దూరు డగుచు నాదు ప్రజల
నెట్లు పాలనమ్ము జేసి ఏచు చుండెనో

దర్మ వృత్తి వన్ను వేసి దన కోశమ్మును నింపితి
దుర్వ్యయమ్ము చేసెనేమొ ధూర్తు డాతడు

అధిక మైన వన్నులతో నమాయకుల కష్ట పెట్టి
దోచు కొనుచు నుండె నేమొ నీచు డాతడు

జనుల శ్రేయమును దలవక దనము కొరకు పాలించెడు
జనవతి రాజ్యమున ప్రజకు సౌఖ్యము గలదా ?

ప్రజల మేలు దలవలేని పాలకు లున్నట్టి దేశ
వాసము కన్న నరణ్య వాసము మిన్న

నాదు వట్ట పేనుగు తిరు నాళ్ళులలో నెక్కు చుంటి
నన్ను వీడి తిండి తినక చిన్న బోయెనో

ప్రజలు రాజ బక్తి వరులు ప్రబలు డైన దుష్ట మంత్రి
పాలనలో నెట్టిడుములు బడుచు నుండిరో"॥

అట్లు చింత నొందు సురదు డన్యు నొకని దుఃఖబార
వివశు జూచి జాలి నొంది వెడలె చెంతకు

"ఎవరవయ్య ? దుఃఖ మేల ? ఏమి కష్ట మొదవె నీకు ?
సాయ వడుదు నుడువు మయ్య ! నత్వరమ్మున

వనమున - పావనమున నీ మనమున వరి దేవనమున
నేకతమున నేకతమున నేగు చుంటివి ?"

అని జనవతి ప్రశ్నింవగ నతడు గద్గదమున బలికె
"వైశ్యుడను నమాధి యనెడు వర్తకుండను

దూర దేశములకు నేగి మారు బేరములను జేసి
కోట్ల కొలది దనము నేను గూడ బెట్టితి

దుష్టులైన నా తనయులు దూర దేశ గతుని జేసి
నాదు నంపదల్ హరించి నారు ధూర్తులై

భార్య గూడ వలపు వీడి వారితోడ వంత పాడి
తరిమి కొట్ట దిక్కు లేక తిరుగు చుంటిని

చెమట నోడ్చి నంపదలను జేర్చి యుంటి   నా పుత్రులు
చిన్నవారు - వ్యాపారము చేయ గలరో కో ?

సాటి వర్తకులకు తాము పోటీగా నిలిచి బేర
సారములను జేయు యుక్తి శక్తులు గలవా ?

ఇరుగు పొరుగు వర్తకులకు నెన్నో ఋణముల నిచ్చితి
తిరిగి యొనగి నారో లేదో తెలియదాయెను

ఇల్లు వీడి పోయి ఎరుగ దెన్న డేని నాకులనతి
కొడుకు లామె నెట్లు జూచు కొనుచు నుండిరో

ఇరుగు పొరుగు వారి తోడ నెన్న డేని బాషింపదు -
ఇట్టి ముగుద కోడలితో నెట్లు మనలునో

మరల నొక్కసారి  ఇంటి కరిగి నతిని నుతులజూచి
మరలి వత్తమనుచు నాకు మనను కలిగెను''

అనునమాది మాట వినిన యవని నాదు డపుడు నవ్వి
"మోసగించు వారిపైన మోహామెందుకు

వారిపైన మమత వదలి వనము లోన ఋషికి సేవ
జేసి నుగతి వడయు'' మనగ జెప్పె నమాధి

"మనసునెట్లొ చిక్క బట్టి మరలింపగ యత్నించితి
మరల మరల వారి పైన మరులు కలిగెను

వారి వదలి యుండలేను వారి తిరస్కారంబును
సైచి యింటి కేగలేను చాలకుందితి"

అనగ రాజు వైశ్యుజూచి "యట్టిదియే నా చరిత్ర
భ్రాంతి వీడలేక నేను వంత జెందితి

నాకుసైత మట్లె మనను ప్రాకు లాడె రాజ్యము పై
కారణమ్ము దెలియరాదు కాంక్ష పెరుగగా

పలువిదముల విషయమ్ములు తెలిసియు మోహంబుగలిగె
హృదయ మిట్లు భ్రాంతి నొంద నేమి హేతువో!

ఆగమ విదులై యుండియు నఖిలశాస్త్రములు జదివియు
మనను చిక్కబట్టు మార్గమును గ్రహించరు

తపము లెన్ని జేసియున్న తత్త్వమును గ్రహించియున్న
నరిషడ్వర్గము గెలుచుట యతి దుష్కరము

పలు విధముల చలియించెడు పంచేంద్రియ చాపల్యము
నరికట్టెడు యుక్తి మార్గ మరయగ తరమా ?

మమతాహంకార ఘోర తమము మనను నావరించ
తొలగద్రోయు కాంతి రేఖ దోచు టెట్టులో

ఋషిని యాశ్రయించి మోహ మెల్ల బాయ వచ్చు" ననుచు
మునిని జేరి వారు భక్తి మ్రొక్కినిలిచిరి

"స్వామి మేము దుష్టులైన వారు మోసగింప నేడు
దీనమైన స్థితిని బొంది తిరుగు చుంటిమి

కాని పూర్వ బంధనముల కాంక్ష వీడ లేకుంటిమి
హృదయ మిట్లు నంచలింప నేమి హేతువో ? "

అనగ మౌని ముఖము మంద హాస రుచుల వికసింపగ
వాత్సల్యము తోప నిట్లు వారి కనియెను

జంతు పక్షి తతికి గలవు జ్ఞానేంద్రియ పంచకంబు
ద్వారము లీ యైదు హృదయ భవనంబునకు

జంతు తతికి లేని వివేచనమువలన సృష్టిలోన
జీవరాశి యందు నరుడు శ్రేష్ఠ డయ్యెను

జంతు పక్షితతులు తమదు సంతానము పెరుగు వరకు
ప్రేమతోడ గాచి పెంచి పిదప వదలును

మతిగల నరుడట్లు గాక ప్రతి పలమాపేక్షించుచు
తన సంతానమును పెంచు తమి జూపుచును

తనను ముసలి తనము నందు తన సంతానము కూరిమి
నాదరింప వలయు ననెడి యాశతోడను -

పిల్లల ననురాగముతో పెంచెడు నీ మానవులకు
ననుబంధము లధికంబై మనను దోచును

మదిలో రాగద్వేషము లుదయించును - ప్రియజనముల
వీడిన విరహము, కూడిన వేడుక కలుగున్

భార్యయనియు పుత్రుడనియు బంధతతులు పెనవేయగ
సంసారము లోన మునిగి సంతసింతురు

మమత లనెడు రజ్జు తతులు మానసమును బంధింపగ
మోహ మంది సంసృతాబ్ధి మునిగి యుందురు

విష్ణుదేవు యోగమాయ విశ్వమెల్ల నిండియుండి
జీవతతుల మోహితమ్ము జేయు చుండును

దేవి వివిధ గుణములుగా జీవుల హృదయముల నుండి
భావోద్రేకముల తాను ప్రకటిత పరచున్

ధన దారా పుత్రేషణ లను బాపగ శక్తి లేక
పునరావృత్తిని బొందుచు పొగులు చుందురు

స్థావర జంగమ మయమగు సర్వజగతి యామె మాయ
సంభవించి పెంపు నంది నమసి పోవున"

అనగ రాజు మునిని జూచి "యనమ ! యోగమాయ ఎవరు?
ఎచట నుద్భవించె నామె? ఎట్లు బుట్టెను ?"

అనగ మేధ సుండు వారి కాదరమున నిట్లు నుడివె
"యోగమాయ యనగ 'నిత్య' యుండు నెప్పుడు

సర్వ వస్తు తతుల యందు సర్వకాల ములను వెలుగు
మూడు గుణము లకును నామె మూలరూపిణి

అమర వరుల యార్తిలాప వ్యక్త రూపమంది వెలుగు
దర్మ రక్షణమ్ము నలిపి దరను గాచును

సనాతనియు హేతుభూత జగన్మూర్తి నారాయణి
యావిర్భావమ్ము నందె నందు రప్పుడు

విష్ణు మాయ మహిమలెల్ల విస్తృతముగ వినిపించెద
వత్సలార ! సావధాన పరత నరయుడీ

భక్త వర్యులార ! వినుడి భవ్యమైన దేవి చరిత
భుక్తి ముక్తి దాయకమ్ము పుణ్య మయమిది

ప్రళయ కాలమందు లోక పాలురు నశియించినారు
విశ్వము మున్నీరు నింపి వేసి యుండెను

శాంతాకారుడు విష్ణుడు శయనించె జలంబు లందు
యోగ నిద్ర నంది యుండె భోగి శయనుడు

విష్ణు కర్ణరంధ్రములను వెలువడి రిరువురు దనుజులు
మధు కైటభు లనెడు వారు మదము తోడను.

ప్రబలమైన యాకలితో బ్రహ్మను కబళింపరాగ
నలువ వెరచి పరికించెను నారాయణుని

భోగిశయను నిద్రనుండి జాగృతి యొనరింపంగా
విష్ణుమాయ నిటు విధాత వినుతి నలిపెను

"వనజనయను కనులయందు మననను నందు వవయవముల
నిద్రయగుచు నలమి యున్న నిను దలంతును

వెన్ను నిదురలేపి యసుర వీరవరుల మట్టు బెట్టి
నన్ను గావవలయు దేవి! నారాయణి రో!

స్వాహ వీవె స్వధవు నీవె వషట్కార స్వరాత్మికవు
త్రిదామాత్రాత్మిక స్థితవు సుధవును నీవే

అనుచ్చార్య వర్ధమాత్ర వక్షర వాగమ జననివి
సావిత్రివి నిత్యవు భయ సంధ్యలు నీవే

సృష్టివి సృజనము నందున స్థితివి పాలనమ్ము నందు
సంహారిణి వంతమందు జగద్రూపిణీ

మూడు లోకముల సృజించి వేడుక పాలనము సలిపి
లయము చేయు శక్తి వీవె భయ వినాశినీ!

యజ్ఞ మీవు - యజనమీవు యజ్ఞమూలమున గలిగెడు
చ్యుతి విరహిత సుగతి వీవు సుధవును నీవే

మహా విద్య మహామాయ మహామేధ మహాస్మృతియు
మహా మోహ మహాదేవి మహా యసురివి

సత్వరజో తమములు నీ సన్నిధినే జనియించును
శుద్ధ సత్త్వ పారమీవు సుగుణ వర్థినీ!

పార్వతి లక్ష్మియు లజ్జయు ప్రాణుల బుద్ధి వికాసము
గలిగించెడు జ్ఞానమీవె కళలును నీవే

శాంతియు తుష్టియు పుష్టియు క్షాంతియు సౌమ్యవు నీవే
పరాపరవు పరమేశ్వరి పావనాశినీ

కల్పవేళ జగతిగ్రమ్ము కాళరాత్రి మోహరాత్రి
నీదు మాయ యని దలంతు నాది శక్తిరో

నదనద్వస్తువులందలి శక్తి వీవు లోకజనని
నేను హరుదు హరియు నరయ నీదు సృష్టియే

ఖడ్గిని ! శూలిని ! ఘోరా ! గదినీ ! చక్రిణి ! శంఖిని !
బాణిని ! చాపిని ! భశుండి ! బరిమాహస్తా !

సౌమ్యులందు నతిసౌమ్యవు సౌందర్యాకృతి వవనిని
వరాత్పరులకంటె వరాత్పరవును నీవే

వెన్నుడు నీ తోడ్పాటున విశ్వము సృజియించు పెంచు
హరియించును నీ మాయల నరయగ తరమా !

విష్ణుడైన నీదు మాయ వీడలేక నిద్ర నొందె
నన్ను నిన్ను పొగడ దేవి! నాకును తరమా ?

హరిని వీడి తొలగవమ్మ అరుల జంప జేయవమ్మ
అభయ మొసగు మమ్మ! నీదు నడుగు లంటెద.

అనివిరించి నుతియింపగ నతనికి ప్రత్యక్షంబై
నీరజాక్షు వీడె యోగనిద్ర యప్పుడు

యోగ నిద్ర తొలగి చనగ నురగ శయను డపుడు నిద్ర
వీడి – దానవులను కనులువిచ్చి చూచెను

రక్తాయత నేత్రులగుచు బ్రహ్మ బట్టి కబళింవగ
నుంకించెడు వారి గాంచె వంకజాక్షుడు

అతిబీకరులచలాకృతులా మదుకైటభుల జూచి
నమాయత్తుడై శ్రీహరి నమరము చేసెన్

ఐదువేల వత్సరములు హరి యనురులతోడ బోరి
యలసెగాని విజయమందడయ్యె నాతడు

ఉక్కు మిగిలి పెనగుచున్న రక్కసుల మనంబులందు
యోగమాయ జొచ్చి మోహమొదవ జేసెను

యోగమాయ యలమి కొనగ నుద్ధతులా రక్కసులును
హరిని జూచి మదముతోడ నాడిరిట్టులు

"నిన్ను జూడ చోద్యమాయె నీ బలమ్ము మదికి నెక్కె
ముచ్చటాయె నొక్క వరమునిచ్చు వారము "

అనగ హరియు వారిజూచి "యంతటి నెనరున్న మీర
లంతమందు రీతి దెలుపు"తనగవారలు

కనుసైగలు చేసికొనుచు కపటబుద్ధితోడ నవ్వి
వంచనతో హరినిజూచి బలికి రిట్టులు

"జలము లేనిచోట మమ్ము చంపుదేని చత్తు" మనుచు
వారధిక మదమ్ము నంది వరమొనంగిరి

కంటిచూపు లానువరకు కల్లోలాంబుధి యున్నది
ప్రళయవేళ - చంపడనుచు వారుదలచిరి

చతురుపాయ శాలి హరియు నతి మహోన్నతముగ బెరిగి
యబ్ధియందు తాను నిలచె నచలా కృతుడై

తొడలపైన వారినుంచి త్రుంచె చక్రధార హరియు
మధుకైటభులట్లు బడిరి మాయగ్రమ్మగా

ప్రళయ జలది వారి రక్తవాహినితో నరుణమగుచు
హరికి నొనగినట్టి దివ్యహారతి యయ్యెన్

దేవి ఇట్లు హరిని ప్రబోధించెను మధుకైటభులను
సంహరింపజేసి కాచె జలజ గర్భుని

దేవి దివ్య చరిత సుధల తృప్తి దీర త్రావు నరుడు
కామితములనంది ముక్తిగాంచు చివరకు

*ఇది మధుకైటభవధ*

# ద్వితీయ చరిత్రము

అటులె లోకమాత పూర్వ మసురు మహిషు దునుమాడగ
నురల తేజమున జనించి ధరణి వెలిగెను

మహిషుడనెడు రాక్షసుండు మహాతపము నలిపి కొలువ
నజుడు మెచ్చి వరము లొసగె నాదరమ్మున

బలము కలిగి వరములంది ప్రతిఘటింప లేనిరీతి
దుర్నిరీక్ష్యుడయ్యె నతడు దోర్బలమ్మున

దేవతలకు జంకి జంకి తిరుగుచున్న యసురులెల్ల
వాని నాయకత్వమంది ప్రబలసాగిరి

చతురంబోధి పరీతము సద్వీపముగా భూమిని
యవని పతుల నెల్ల గెలిచి యాక్రమించెను

సహజవైరమును దలంచి సైన్యముతో సురలదాకి
వారి మహిమలెల్ల గొనెను ఘోర రణమున

వరుణ వాయు యములదాకి వారి రాజ్యములను గొనెను
యజ్ఞ భాగములను తానె యాహరించెను

దేవరాజు దాకి మహిష దితిజు డతని తరిమికొట్టి
యాను దర్మ సభను తానె యాక్రమించెను

సాదుజనుల హింసించెను సన్యాసుల జంపసాగె
ఋషుల తపము జెరచి వారి నేచసాగెను

స్త్రీజనాళి బలిమి బట్టి చెరల బెట్టె బాలకులను
పట్టి తెచ్చి చిత్రహింస పాలు చేసెను

కాందిశీకులైన సురలు కమలభవుని శరణు గోర
బ్రహ్మ వారు గొలువ మేరు పథము జేరెను

హరి హరులును గూడి యచట సరస భాషణముల నంద
వారి జేరి శరణు జొచ్చి నారు సురవరుల్

మహిమ చేష్టితముల నుడివి మట్టు పెట్టు దనుచు సురలు
వేడు కొనిరి నిటల నయన విష్ణు దేవులన్

మహిమ దురంతములు వినిన మాధవునకు, శంకరునకు
నాననముల క్రోధరేఖ యంకురించెను

హరి హరులును నాగ్రహమ్ము నంద వారి ముఖము నుండి
కాంతి పుంజములు వెలువడె కనులు చెదరగా

ఆదిదేవు చిత్త మరసి యమర సంఘ మెల్ల తమదు
శక్తి ధార పోసి రసురు సంహరింపగా

దేవవరుల ముఖము లందు తేజో జాలము వెలువడి
మిన్ను దాకి దిగంతముల మిగిలి వెలిగెను

వేనవేల వే వెలుగులు బేర్చి నట్టులగణితమగు
నింద్ర ధనుపు లొక్కటి గావించి నట్టులు

అంబరాన నున్న తారలన్ని యొకట గూర్చి నట్లు
ప్రళయకాల తటిల్లతలు గలిసి నట్టులు

విశ్వమందు నున్న యన్ని వెలుగు లొకట గూర్చినట్లు
వెలుగు తేజ మరసి సురలు వెరపు వీడిరి

ఆ తేజో పుంజంబుల నతివ రూపముగ మలచగ
నాది శక్తి వ్యక్తమగుచు నవతరించెను

హరుని తేజమున ముఖంబు యముని తేజమున కచంబు
చంద్రు తేజమున నురంబు జనని కేర్పడెన్

వెన్ను తేజమున గలిగెను విస్తృత బాహుల సంపద
ఇంద్రు తేజమునను నడుము నేర్పడి వెలిగెన్

అజుని తేజమున నంగ్రములు ననల దీప్త తేజముననను
ప్రజ్వరిల్ల త్రినేత్రములు ప్రభవ మందెను

అర్కు తేజ మామెకు పాదాంగుళులుగ రూపొందెను
అష్ట వసువుల తేజము కరాంగుళు లయ్యెన్

దనదు తేజమున నాసిక దర తేజమ్మున పిరుదులు
వరుణు తేజముననూరు ద్వయములు నయ్యెన్

ఉభయ సంధ్యలామెకు భ్రూ యుగ్మములై విలసిల్లెను
ప్రజాపతులకాంతి దంత పంక్తి యయ్యెను

కర్ణములుగ వాయు వమరె కమల మిత్రు రశ్మి రోమ
కూపములను బొంది వెలిగె చూపు చెదరగా

దుర్నిరీక్ష్య రూపముతో దోర్దండ సహస్రముతో
నాకసంబు నంటి వెలిగె నాది శక్తియు.

నంతనంబు నంది సురలు స్వకీయాయుధముల నుండి
నూత నాయుధములు దీసి మాత కొసగిరి

హరుడు శూల మిచ్చి నాడు హరి సుదర్శనమ్ము నిచ్చె
నజు డొసంగె కమండలము నక్షమాలయు

ఇంద్రుడు వజ్రాయుదమ్ము నిడి యైరావతము నుండి
గంట తీసి యొసగి నాడు కాత్యాయనికి

కాలదండ మిచ్చె యముడు కాలు దసియు డాలు నిచ్చె
హిమవంతుడు సింహ వాహనము నొసంగెను

విశ్వకర్మ కవచమ్మును వివిదాస్త్రములును పరశువు
వరుణుడు శంఖము పాశము భక్తి నొసగిరి

క్షీర వార్ధి కుండలములు హార కటకకేయూరము
లంగు ళీయకములు దేవి కరణ మిచ్చెను

పదమంజీరములు నెపుడు ప్రొత వడని వననమ్ములు
మౌక్తిక హారములు నిచ్చె మాత కప్పుడు

సిగపూవుగ ధరియింపగ చిరు వెన్నెల రాయని తన
కాడ పడు చటంచును క్షీరాబ్ధి యొసగెను

వార్ధి విభుడు కింజల్కిని, వాడి పోని పంకజములు
కరము భక్తి తోడ నవుడు కాన్క పెట్టెను

అతుల శర శరాననములు నక్షయ తూణీరమ్ములు
వాయు దేవు డొసగె, నగ్ని బల్లె మిచ్చెను

ఆదిశేష డిచ్చె నాగ హారమును, కుబేరు డిచ్చె
నక్షయమగు పానపాత్ర నంబ కప్పుడు

దివసపతియు తనదు కాంతి దేవి రోమముల కొసంగ
దుర్నిరీక్ష్య తేజంబున దుర్గ వెలిగెను

భూనభోంతరములు నిండి భుజ పంక్తుల విరాజిల్లు
దుర్గ జూచి నకల నురలు తుష్టి జెందిరి

శక్తి నడచు చుండ భూమి నంచలించె నామెసింహ
నాదములకు దిగ్వలయము బేదిల్లినది

తమదు శక్తి సంగమమున తన్విని సృష్టించి నురలు
అవని పతుల గూడి యామె ననునరించిరి

ఆయుదమ్ములను దరించి యనుచరులై నురలు రాగ
కనక దుర్గ యపుడు కదలె కదన భూమికె

విశ్వరూపమును దరించి వివిదాయుదముల వహించి
మంటి నుండి మింటి దాక యంటి నడచెను

నురలు జయలు పెట్టగకుల గిరులందు ప్రతిద్వనించె
మునులు సలుపు నుతులు రోదసిని నిండినవి

తల్లడిల్ల లోకమెల్ల దైత్యులెల్ల వెరగు పడుచు
సైన్యముల సమీకరించ నంద డించిరి

క్రుద్ధు డగుచు మహిష దపుడు యుద్ధమునకు సిద్ధ పడుచు
దండ నాథులెల్ల కొలువ తరలి వచ్చెను

చామరుండు, చిక్షురుండు సమరశీలి యసి లోముడు
బాష్కలుండు, బిడాలుండు పరి వారితుడు

ఉగ్రరూపి యుదగ్రుండు యోదుడౌ మహా హానుండు
మహిత సైన్యములను గొంచు మహిష జేరిరి

అసురు లట్లు కోట్ల కొలది యాదిశక్తి చుట్టు ముట్టి
యస్త్ర శస్త్ర బలము జూపి యద్ద గించిరి

పెక్కురు రక్కసు లొక్కెడ చిక్కువరవ కనకదుర్గ
చెక్కులు చెమరక రణమ్ము జేయ సాగెను

పాద ఘట్టనముల భూమి పద పదయని వణకు చుండ
నల్లె ఘ్రాటీ మ్రోతల క్షోభిల్లె జగములు

భుజ సహస్రములదిగుచుట వ్రానుట ఏయుట దెలియని
కరణి దుర్గ శరవర్షము గురిపించినది

కొండ మీద వాన జల్లు గురిసి నట్లు వారువైచు
నాయుదములు మధ్యముననె యడచ సాగెను

కదన మందు కనక దుర్గ వదన మందు నూర్పులతో
గణ సైన్యము లగణి తముగ జనన మందెను

గణములు రణ తూర్యము కను గుణముగ నాట్యము సల్పుచు
శత్రు హరణ ఖేలనమ్ము సలుప సాగెను

గణ సైన్యము శంఖమ్ములు కాహాళములు పటహంబులు
మ్రోగించి కరాళ నృత్యముల నొనర్చిరి

కాలు చీచ్చు వనము జొచ్చి కాల్చునట్లు వాహనమగు
సింగము పరవర్గము భక్షింప సాగెను

దితిజ తతుల వెంటాడుచు దేవి శూలమున బొడిచెను
మునల ఘాతముల కొందరి కసి మసంగెను

ఘంటా స్వన మోహితులై కదతేరిరి కొంత మంది
గదతో మోదగ రక్తము గ్రక్కి చచ్చిరి

కరకు రక్కసుల కొందరి ఖడ్గంబున ఖండించెను
పాశముతో నొకకొందరి బంధించినది

కంటి చూపు మేర దనుజ మన కళేబరములు నిండె
రక్తపు వాగులు పారెను రణరంగమున

చిక్షురు విరదుని జేసెను చేతి త్రిశూలమున దేవి
యతడు వేయ శూలముతో నడచి చంపెను

సింగము చామరు మార్కొని చిత్రగతుల రణము నలిపి
శిరమును ఖండించి వేయ చెదిరి రసురులు

వాతూలాహతి మేఘ వ్రాతంబులు దూలి నట్టు
లసురులు బరచిరి దిక్కుల నద్రువ నరచుచు

మదమాతంగ సమూహాము మదజలము స్రవించి వరచె
వాహన సింహాము గర్జాధ్వానము నలువన్

సోకు మూక లెల్ల తనను చుట్టు ముట్ట కనక దుర్గ
యందరికిని నన్ని రూపు లగుచు పెనగెను

కఠిన శిలా వృక్షాదుల ఘాతముల నుదగ్రు జంపె
ముష్టి ఘాతముల కరాళు, దుష్టు నడచెను

తామ్రాంధకులను నీచపు దానవులను బాణముతో
గొట్టి వధించెను బాష్కలు గుదియను జంపెన్

ఉగ్ర శూల ధారలతో నుగ్రాస్యుని నుగ్ర వీర్య
మహా హానుల వధియించెను మాత రణమున

దుర్ముఖ దుర్ధరు లిరువుర దురమున శరమున బోరిగొనె
ఖడ్గ దారతో బిడాలు ఖండించినది

ఆహావ రంగము నందున నరుల కొరకు వెదకి వెదకి
సింహా వాహానమ్ము వారి జీల్చి చంపెను

తృణ వితానములను వహ్ని కణ మేర్చిన యట్లు రేగి
వరివందుల నాసింహాము వరి మార్చినది

యుద్ధ తూర్య నాదములకు నొద్దిక నాట్యము నలుపుచు
శిరః కందుక ఖేలన జేసె గణములు

శిశిర ఋతువు నందు డుల్లు చెట్ల యాకులట్లు బలము
లెల్ల విగత జీవమగుచు నిలను వ్రాలెను

దండ నాదు లెల్ల గూలి దైత్యనాధు డొంటి నిలచి
మహిష రూవు దగుచు జగతి మాడ్చ సాగెను

గొరిజలతో కొట్టి కొట్టి కొమ్ములతో కుమ్మి కుమ్మి
మోర తోడ విసిరి విసిరి క్రూరత జూపెన్

గిట్టలతో చివ్వి చివ్వి గిరి దరులను పొడిచి పొడిచి
వరి వందుల తరిమి తరిమి బలము జూపెను

వాలము జాడించి విసర వాతహాతిని జలద పంక్తి
బోలె చెదరి పుడమి బడుచు మూర్ఛి లె గణముల్

భ్రమణ వేగమున కొందరు వటురావంబున కొందరు
నిశ్వాసంబుల కొందరు నేల గూలిరి

గొరిజలతో రాచి రాచి ధరణిని చూర్ణము చేయుచు
నురిమినటు జగతి వణక నరువ సాగెను

అవనీ తలమును శీర్షం బైదరా పరాగ పటలి
గగనంబున రవిబింబము గ్రమ్మి వైచెను

అంధకార మలమికొనిన దవుర జాండ కటాహమున
నఖిల భూతములు భయమున నాక్రోశించెన్

అతని నిశ్వాసానిల మగ్ని జ్వాలల గురియుచు
మహిని భూత జాతములను దహియించినది

ఉరుపీఠికి కుప్పించుచు నురు గిరులకు లంఘించుచు
నుదధికి వ్రాలుచు తేలుచు నుగ్ర రూపుడై

అతి వేగముగా చరించి యాయుధహతి కందకుండ
జగముల క్షోభిల్ల జేసి చండత మెరసెన్

రవి చంద్రులు వక్రించిరి గ్రహ ఘర్షణ సంభవించె
స్థానచ్యుతి బొంది చెదరె తారక లెల్లన్

కొమ్ములతో పెద్ద కొండ కొమ్ములవుడు చిమ్మి చిమ్మి
తోక తోడ నబ్ధిజలము తొలగ జిమ్మెను

చండ వాతములను రేపి గండ శిలలు వర్షించుచు
నంబుదముల దూలవైచె నసుర మాయతో

ఉల్కా సంపాతనమున నుర్విని కంపింపజేయ
గిరులనుండి పెనుబండలు దొరలి పడినవి

సప్త పర్వతముల దెచ్చి సప్త సాగరముల గలిపి
యా పంకము దిగ్భిత్తుల కలదనెంచెను

కదలి యడుగు నుడుల నడుమ గడలు కొనిన బడబ వహ్ని
ధరను గిరుల దరుల వరలు దావ వహ్నిని

గగన మనా ఘనములందు రగిలి వెలుగు విద్యుదగ్ని
గలిపి విశ్వమెల్ల నతడు గాల్ప నెంచెను

దనుజు డట్లు చెలరేగగ కనక దుర్గ చిత్త మందు
జంతు తత్త్వ తేజ మణచ సంకల్పించెన్

భద్రకాళి పాశమ్మున బంధించెను మహిషాసురు
సింగ మాయె నతడు - దాని శిరము తరిగెను

మరల పురుష డయ్యె నతడు శరము వెయ నేనుగాయె
దేవి దాని తొండము ఛేదించి వేసెను

మరల మహిష రూపమంది గిరుల దెచ్చి వేయ సాగె
హుంకరించె నాదిశక్తి యుగ్ర రూపయై

"అనురాధమ! మిడిసి పడకు మట్టు పోన మేల? నేను
మధువు నాను వరకు నీకు మనికి యుండును"

అనుచు దేవి మధువు త్రాగి యరుణముగా మోముదోప
హరిణంబును సింహ మట్టు లసురు గ్రమ్మెను

కంఠము పై పాదము నిడి కరకు శూలమున బొడువగ
నిజరూపమ్మున మహిషుడు నిర్గమించెను

తనదు ఖడ్గ ధారలతో తటుకున నా శిరము తరుగ
మహిష దైత్యు దీర్ఘ తనువు మహిని ద్రెళ్ళెను

సురలు సవ్య పారిజాత సుమ వితానములను బూని
కనక దుర్గ చరణ యుగళి గనగ వచ్చిరి

మహిష దైత్యుడిట్లు సైన్య సహితముగా నశియింపగ
భక్తి నమ్రులగుచు సురలు శక్తి బొగిడిరి

"జగము లందు వ్యాప్తి జెంది సకల సురల శక్తి యగుచు
సర్వ వంద్య యైన జనని సంస్తుతింతుము

హరిహరాదులైన నెరుగ నట్టి మహిమ గలుగు దేవి!
యశుభ భయము బాప దలపు మమ్ము కరుణతో

లక్ష్మి వగుదు నుగుణులంద లక్ష్మి వగుదు పాపులందు
బుద్ధి వగుదు బుధజనముల పూర్ణరూపిణీ

నుజను లందు శ్రద్ధ వగుదు నుకృతు లందు లజ్జ వగుదు
దుర్గుణములు నుగుణములును దుర్గ నీవెగా।

అహావ రంగము ననునీ యద్భుత చర్యలు - నూహకు
నందని రూపము బొగడగ నగునే మాకున్

త్రిగుణాత్మక వైయుండియు త్రిగుణ దోషముల జెందవు
త్రిమూర్తులకు నందని వర దేవత వీవే

నీతేజోంశము నుండియె నిఖిల జగమ్ములు వొరమును
అద్య ప్రకృతివి నీవే యాశ్రయమ్మవు

అఖిల నురల రూపమ్ముల హావిన్సులను గొనెదు నీవె
స్వాహావు - పితృ ముక్తి హేతు స్వధవును నీవే

ఇంద్రియముల చిక్కబట్టి ఎల్లరు నలిపెడు తపములు
పరావిద్య యైన నీదు పద నన్నిధికే

శబ్ద బ్రహ్మాత్మికవును నదమల బుగ్వేదంబును
యజుస్సామములను గా యత్రి _యు నీవే

ఓంకారాత్మక మగునా యుద్గీథయు నీ రూపమె
పరమార్తిని బరి మార్చెదు 'వార్త' యు నీవే

హరి వక్షము నను లక్ష్మివి హరు దేహార్థమున గౌరి
పజ వదనంబున శార దాంబయు నీవే

నంసారం బను దుర్గమ జలనిది దాటించు నావ
శాస్త్రసార మభ్యసింప జాలు మేదవు

దర హానము తో వెలుగుచు పరిపూర్ణ నుధాంశు మించు
నీ ముఖమ్ము చూచి మహిమ డెటు కోపించెన్

అరుణంబై యుదయించెడి యాదిత్యుని వలె తీక్ష్ణం
బగు మోమును గని మహిషం డసువుల బాసెన్

కినుక బూని తేని కులము క్షణమున హరియింతు వనుచు
మహిష సైన్య వద వలనను మాకు దెలిసెను

నీదయ ప్రసరించినచో నిఖిలలోక పూజ్యుడగును
వంశము కీర్తియు దనమును వానికి కలుగున్

నీ కరుణను సకల దర్మ నిరతు డగును మోక్ష మందు
సకల కర్మ ఫలదాయని సదయవు దుర్గా!

నీవు కరుణ గనని వాని నిన్ను కనుల గనని వాని
లోకము దూరును - ఆత్మయు లోకువ చేయున్

'దుర్గా' యని నిను దలచిన దుర్గమ కష్టము తొలగును
సుఖశాంతులు వర్ధిల్లును శుభములు కలుగున్

ఘోర భయ దరిద్ర దుఃఖ హారిణి పుపకార మతివి -
అర్ద్ర చిత్త వీవు గాక నన్యు లెవ్వరు

నరక వాస యోగ్యులైన యరుల 'ససిని మరణ మంది
దివికి నరుగుడ'ని కరుణను దీవించెదవు

అఘము బాప శత్రు జనుల నాహవమున సంహరించి
మోక్ష పదము నొసగు దయా మూర్తివి నీవు

కరుణను గురిసెడు నీముఖ కమలమ్మును జూచు కతన
ఖడ్గశూల తీక్ష్ణ ద్యుతి కనులు చెదరవు

యుద్ధంబున నిష్ఠురతయు నుల్లంబున నతి కరుణయు
నతి మనోహరాకృతియును నన్యులకేవీ

కంటి చూపు మాత్రముననె కాల్చ గలవు వైరిజనుల
గాని యట్లు హరియించక కదన మందున

నీయాయుదముల తాకిడి నిష్ఠుర పాపము బాపుచు
శస్త్రపూత చరితులుగా నలువుదు వంబా!

నీయాయుదముల జ్వాలల నీరు గాక బ్రతుకుదురన
నుధా రోచి వంటి మోము జూచియ కాదా!

అరి నంఘము పైననను నీ కరుణామృత వృష్టి గురియ
'జగన్మాత' యనెడు పేరు సార్ధకంబగున్

అనురుల హారియించి లోక మంతయు రక్షించి నావు
వైరులకును ముక్తి నిచ్చి వారి గాతువు

నురవిరోదులను దుష్టుల హారియించుట నీ నైజము
దురవ గాహ్యా తవ మహిమల నరయగ తరమా

శూల భ్రమణంబులతో నాలుగు దిక్కులను గాచి
యవ జయముల బరిహారింవు మమ్మ! కరుణతో

శూలంబున మము గాచుము శుభ ఖడ్గంబున గాచుము
మంటా జ్యానాదంబుల గాచుము మాతా!

సౌమ్య రూపముల గాచుము జగతి ఘోర రూపమ్ముల
నిరతము గాచుము మాతా నిండు కరుణతో

నీ కరముల రంజిల్లెడు నిఖిలాయుదముల గాచుము
జగములకును మంగళమిడి నర్వమంగళా!

వేన వేల హాస్తంబుల వివిదాయుదముల దరించి
దుష్టానురులను జంపిన దుర్గ! కావు మా!''

నందనవన కునుమమ్ముల గంద ధూపదీపమ్ముల
జగన్మాత నర్చించిరి నకలామరులు

నురార్చనల తుష్టి నంది పరాశక్తి నురల జూచి
"వరములు వేడుం" డనుచును కరుణను బలికెన్

"ఆర్తి గలిగి నపుడు కరుణ నాదుకొనుము నీ చరిత్ర
పఠన జేయు వారికిమ్ము వరములు" ననిరి

'తథాస్తు'నుచు దేవియు నంతర్ధానము జెంది మరల
సురల శరీరములు తాను జొచ్చి నిలిచెను

ఇట్టు దేవి లోకములకు నిడుములు కలిగినను తాను
వ్యక్త రూప మంది యార్తి బాపు చుండును

దుర్గ చరిత వినిన వారు దుస్స్వప్న ఫలమ్ము తొలిగి
సుఖ శాంతుల వర్ధిల్లుచు శుభము కందురు

*ఇది మహిషాసుర వధ.*

# తృతీయ చరిత్రము

దేవి దివ్య లీల లెల్ల దేవ గురుడు తెలియ లేడు
శేషుడైన యామె చరిత చెప్ప జాలడు

జగము లార్తి నంది నవుడు స్వయం వ్యక్త రూప మంది
యభయ మొసగ దేవిగాక నన్యు లెవ్వరు?

వివిధ రూపముల ధరించి విబుధ విరోధుల దుష్టుల
శుంభ నిశుంభుల జంపిన దంబ పూర్వము

వినుడు వత్సలార' మీకు వివరించెద నా చరిత్ర
మత్యద్భుత మఖిల కల్మ షావ హాంబిది

తొల్లి శుంభు డనెడు వాడు ధూర్త రక్కసుండు తనకు
తమ్ముడగు నిశుంభు గూడి తరిమె సురలను

వేల్పురేని మీదనెత్తి కల్పతరువు, కామదోగ్ధ్రి
యైరావతముల హరించి యంత బోవక.

దిక్పతుల జయించి వారి తేజో సంపదలను గొని
యాయధికారములను తానె యాక్రమించెను

మూడు లోకముల జయించి ముచ్చటైన వస్తుతతులు
తనకు సొంతముగ నొనర్చు తమి యాతనికి

యజ్ఞఫలము లతడు గొనగ సమరు లెల్ల రబలు లగుచు
కాందిశీకులైరి మదులు కలత జెందగా

తొల్లి మహిషు జంపి నట్టి దుర్గ మహిమలను దలంచి
మేరు వర్వతమును జేరి నారు దివిజులు

అగమ సంతతికని ది వ్యామోదము గూర్చు దేవి
చరణ సరసిజముల వారు శరణు జొచ్చిరి

ప్రళయ మందు జగములెల్ల విలయ మంద పెను చీకటి
యలమి కొనగ - నొకట వెలుగు నంబ లొగిడిరి

"దేవికి వైష్ణవికి మహా దేవికి శివకును భద్రకు
ప్రకృతికి రక్షా శక్తికి ప్రణమిల్లెదము

వృద్ధిని కల్యాణిని నంసిద్ధిని నైఋతిని లక్ష్మి
శర్వాణిని ధరాధరను నంన్నుతింతుము

గౌరిని, రౌద్రను, నిత్యను కమనీయ నుదాంశురుచిని
నుఖరూపిణీ జగద్ధాత్రి న్నుతి యొనర్తుము

దుర్గ తారిణిని, దుర్గను ధూమ్రను, కృష్ణను ఖ్యాతిని
నర్వకారిణిని, సారను నంన్నుతింతుము

అతి సౌమ్యకు నతిరౌద్రకు నఖిల జగత్ప్రతిష్ఠకును
కృతికిని దేవికి సాగిలి కేలు మోడ్తుము

ధాత్రి భూత జాలమందు తానె విష్ణు మాయ యనగ
వ్యాప్తి జెంది యుండు దేవి బ్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానే చేతన యనంగ
వ్యాప్తిజెంది యుండు దేవి బ్రార్థించెదము

దాత్రి భూత జాలమందు తానె బుద్ధి యనగ నుండి
వ్యాప్తి జెంది యుండు దేవి బ్రార్థించెదము

దాత్రి భూత జాలమందు తానె నిద్ర యనగ నుండి
వ్యాప్తి జెంది యుండు దేవి బ్రార్థించెదము

దాత్రి భూత జాలమందు తానె క్షుదా రూప మంది
వ్యాప్తి నంది యుండు దేవి బ్రార్థించెదము

దాత్రి భూత జాలమందు తానె చాయ యనగ నుండి
వ్యాప్తి నంది యుండు దేవి బ్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానె శక్తి రూపమంది
వ్యాప్తి నంది యుందు దేవి ప్రార్థించెదము

దాత్రి భూత జాలమందు తానె తృష్ణ యనగ నుండి
వ్యాప్తి నంది యుందు దేవి ప్రార్థించెదము

దాత్రి భూత జాలమందు తానె క్షాంతి రూపమంది
వ్యాప్తి నంది యుందు దేవి ప్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానె జాతి రూపమంది
వ్యాప్తి నంది యుందు దేవి ప్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానె లజ్జ యనగ నుండి
వ్యాప్తి జెంది యుందు దేవి ప్రార్థించెదము

దాత్రి భూత జాలమందు తానె శాంతి రూపమంది
వ్యాప్తి జెంది యుందు దేవి ప్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానె శ్రద్ధ యనగ నుండి
వ్యాప్తి జెంది యుందు దేవి ప్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానె కాంతి రూపమంది
వ్యాప్తి జెంది యుందు దేవి ప్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానె లక్ష్మి యనగ నుండి
వ్యాప్తి జెంది యుందు దేవి ప్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానె వృత్తి రూపమంది
వ్యాప్తి నంది యుందు దేవి ప్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానె స్మృతి యనంగ నుండి
వ్యాప్తి జెంది యుందు దేవి ప్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానె దయా రూపమంది
వ్యాప్తి నంది యుందు దేవి ప్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానె తుష్టి రూపమంది
వ్యాప్తి నంది యుండు దేవి ప్రార్థించెదము

ధాత్రి భూత జాలమందు తానె మాతృ రూపమంది
వ్యాప్తి జెంది యుండు దేవి ప్రార్థించెదము

దాత్రి భూత జాలమందు తానె భ్రాంతి రూపమంది
వ్యాప్తి జెంది యుండు దేవి ప్రార్థించెదము

అఖిల భూతములకు నింద్రి యాదిష్టాత్రిగ వెలుగుచు
చిద్రూపిణి యైన దేవి సేవించెదము

వరగర్వితులై యసురులు సురల మైన మమ్ము కష్ట
పెట్ట సాగి రార్తి బాపు విశ్వనాయికా

సురపతి సేవల నందుచు సురల కభీష్టము దీర్చెడి
శుభమూలకమగు దుర్గను స్తుతియించెదము"

నిఖిలామర నివహ మిట్లు నిగమ విదుల నుతులొనర్చి
యహంకార రహితులగుచు ప్రాంజలు లైరి

స్నానార్థము గంగకు జను శైలజ వారిని జూచుచు
"ఎవరిని ప్రార్థించు చుంటి రిప్పు" డనియెను

పార్వతి దేహము నుండి శుభాంగి దేవి యుద్భవించి
"శుంభ నిశుంభుల హరింప సురలు గోరిరి

వారి నుతులు నాకోనమె పార్వతి!" యనెనంత గౌరి
'కాళిక' యన హిమవంతము కడకేగినది

అటు పార్వతి తను కోశము నందు జనించిన దేవియు
'కౌశికి' యనవిరాజిల్లె ఖలుల నడంపన్

కౌశికి నిలకడ గల క్రొక్కారు మెరుపు తీగ వోలె
నతి మనోహరముగ సుందరాకృతి దాల్చెన్

కౌశికి లోకోత్తర తను కాంతులు వనమున వెలుగగ
సుమేరు శిఖరమున వెలుగు చుండెను ప్రీతిన్

శుంభ నఖులు చండ ముండు లంబ జూచి చకితు లగుచు
త్వరిత గతుల నరిగి దనుజ పతి కిట్లనిరి

"రాజరాజ! మేరుశిఖరి రమ్యమైన రమణి గలదు
వనము లెల్ల వెలిగె నామె వన్నె మేనితో

స్త్రీలలోన రత్న మామె సిరులు దొరలు నామె జూడ
నామె నగవు వెన్నెలయగు నంత ఏటికి?

కుంకు మాక్త తనుకాంతులు క్రొంజివురుల మిసిమియగును
కలికి తళుకు చూపు కుసుమములై పూచెను

మృదు బాషిణి నుడులు శ్రుతిస్మృతి పదమున నిలిచి యుండు
అంచయాన నడకలు నృత్యాగ మంబగున్

మూడు లోకములును నామె మోము నందు నొక్క కళకు
సరిగావా లక్ష్మియైన సాటి వచ్చునా?

ఎవని నామె ప్రియమారగ నీక్షించునొ యతడె లోక
కాంతు డగును వీరుడగును కవివరు డగును

ఎవని నామె వాలు గంట నించుక ప్రేమను గాంచిన
దన్యుడతడు మాన్యు డగ్రగణ్యుడునగును

గడ్డి పోచయైన నామె కరముసోక వజ్ర మగును
వెండి కొండ యామె గనక బెండు వోవును

ఆమె చూపు నోచకున్న నామె జూడ నెంచకున్న
నట్టి వాని జీవితమ్ము వ్యర్థమై చనున్

అసుర నాద! నిముసమేని యాలసింప వలదు లెమ్ము
తగిన దూతలను బంపుము మగువ చెంతకు

అవని యందు రత్నభూత మైన వాని నన్ని దెచ్చి
యగ్ర గణ్యుడైన వాడ వతివను గొనుము

అమరనాదు దోలినాడ వైరావత కల్పకముల
నుచ్చైః శ్రవమును గ్రహించి యున్న వాడవు

పరమ తపోబలము వలన బ్రహ్మను మెప్పించి నీవు
హంస యుక్త విమానమ్ము నర్ధి గొంటివి

దనదు నోర్చి మహా పద్మ మననిది వారియించినావు
వాడని కింజల్కినియును వార్ధి యొనగెను

వరుణుడు నిత్యము కనకము గురిసెడి చత్రము నిచ్చెను
ప్రజాపతియు నప్రతివాత రధము నిచ్చెను

మృత్యువు 'సుత్క్రాంతిదమ' ను మేటి శక్తి కాన్కనిచ్చె
వరుణుని పాశమ్మును సోదరుడు తెచ్చెను

అగ్ని యోడి యగ్ని శౌచమగు వననమ్ముల నిచ్చెను
అబ్ధి తనదు రత్న జాల మప్పన మిడెను

మహాయోదు లెందరినో మట్టిని కరిపించి శ్రేష్ఠ
వస్తువు లెన్నియొ దెచ్చితి వనితదే గదే

ఆ సుందరి నిను జేరిన బానమాన మగును నగరి
మును దెచ్చిన వస్తుతతికి మనత గలుగును

తగు వారిని బంపించుము మగువను రప్పించు కొనుము
జగత్పాలకులకు లేని సౌఖ్యము గొనుము ''

నఖుల మాట వినిన శుంభ చక్రవర్తి సుగ్రీవుని
చేరబిలచి యాకౌశికి చెంత కంపెను

సుగ్రీవుడు దేవిజేరి స్తుతి యొనర్చి తనరాకకు
కారణమ్ము జెప్పెను సాకల్య రీతితో

"ఎవని మూడు లోకములును నేలికగా గౌరవించు
నెవడు దేవరాజునైన నెదిరి గెలిచెను

ఎవని యాజ్ఞ దేవ జాతులెల్లను శిరమున దాల్చునో
యా శుంబుడు నీకంపిన యాజ్ఞను వినుము

"మూడు లోకములును నన్ను రేడుగ సంపూజించెను
సురలును నా వశవర్తులై యరయుము దేవీ

యజ్ఞంబుల నర్పించెడి హావిస్సులను నేగ్రహింతు
జగములలో శ్రేష్ఠ వస్తు సంతతి నాదే

లోకపాలకుల నెల్లర లోగొని - బలిమిని వారల
నద్వస్తువు లెల్ల నేన సంగ్రహించితి

సుర గరుడోరగ కిన్నర నర గంధర్వుల మేలిమి
వస్తు తతుల మానదకును వన్నె కలిగెను

ముజ్జగముల స్త్రీలందు సముజ్జ్వలాంగి నీదురాక
వాసి గనిన మానదకును వన్నె పెంచును

యత్నముతో విశ్వమందు రత్నభూత వస్తు సమితి
సంగ్రహింప దలచినాను సారసాక్షిరో

రమణీ లోకము నందున రత్న భూత వైన నీవు
రత్న భుజుని నను జేరుట రమ్యము కాదా ?

అతివ లందు నగ్రగణ్య వైన నీవు చక్రవర్తి
నభినరింప యుక్తియుక్త మగునా ? కాదా ?

బలోపేతు లైన మాకు విలాసినివి నీదు పొందు
కనకమునకు నెత్తావులు గలుగుట - కాదా ?

నన్ను చెట్ట బట్ట వచ్చు నాసోదరునైన నరియె
వరిణయమ్ము నందిచేర పాడి నీకగున్

నన్ను జేరి ముజ్జగముల కన్ను నన్నలందు ద్రిప్పు
నీదు రూప విభవమునకు నిల్తు దాసుడై

బలిమినైన చెలిమినైన బహుమానముగా నైనను
శ్రేష్ఠ వస్తుతతులు నన్ను జేరుకోవలెన్''

అనుచు దూత బలుక దేవి యంతరంగ మందు గినిసి
వాని జూచి వలికె "నీదు వాక్కులు నిజము

శుంభు డంత మనుడు - నాని శుంభుడును బలాధికుండు
యాతాయాత జనంబులు ననగ వింటిని

మగటిమి గల మగవారలు మగువలకును వరణీయులు
జగజ్జేత లఖిలమునకు సార్వభౌములు

కాని - ముందు చూపు లేక నేను దురబిమాన మంది
చిన్న నాడె యొక్క ప్రతిన జేసి యుంటిని

ఎవడు నన్ను రణము నందు నెదిరి నిలిచి గెలుచు వాడొ
యట్టి జెట్టి చెట్ట బట్టు దంచు నెంచితి

అటుగావున పూర్వోక్తుల నవమళింప నేర గాన
మీ ప్రభువున కెరుక పరచు మీవు దీనిని''

అనగ దూత'' దేవి! నీకు నంత గర్వమేలనమ్మ!
మేటి మగలు శుంభునెదిరి యోటమి గనిరి

అబల వీవు నిస్సహాయ వట్టి పెక్కు మాట లేల?
రాజు కడకు బుద్ధి గలిగి రమ్మ్ము పోదము''

అనిన దేవి ''ఏమి చేతునట్టి యొట్టు బెట్టు కొంటి
శుంభు కెరుక పరచు మతడు జూచు ముందట''

అనుచు దేవి నుడువ దూత యగు సుగ్రీవుండు బోయి
యామూలాగ్రము వచించె నా శుంభునకు

అసురపతియు ధూమ్రనేత్రు డనెడు దండనాథు బిలిచి
యహంకార ముట్టి పడగ ననియె నిట్టులు

"ధూమ్ర నేత్ర! వేగచనుము దూర్తురాలు దానిదెమ్ము
అడ్డమైన సురలనైన హతము చేయుము

కిల్బిషమ్ము లాడెనేని కేశపాశ మొడిచిపట్టి
తోడితెమ్ము పొమ్మ"న చనె ధూమ్ర నేత్రుడు

అరువది వేల మహాసురు లాయుధముల చేతబట్టి
వీరాలాపము లాడుచు వెంట నడిచిరి

శంకరుని శిరమ్ముపై శశాంకుని వలె సుమేరువున
నధివసించి యున్న దేవి నసురులు గనిరి

దేవి జేరి ధూమ్రాక్షుడు "నీవు శుంభు కడకు రమ్ము
స్వయముగ రాకున్న విషమ పరిణామములే

బలిమి దీర్ఘ కేశములను బట్టి లాగి కొంచు బోదు
నసురనాథు కడకును బదులాడక రావే"

అనిన దేవి "నొంటి గత్తె నబలను నేనేమి చేతు
వీరులైన మిమ్ము జూడ వెరవు గలిగెను

మాటలు తడబడు చున్నవి మనసు కలత జెందసాగె
దిక్కు లేక యొంటరిగా చిక్కితి మీకున్"

అనుచు నుల్లనమ్ము లాడి యటు పిమ్మట హుంకరించ
వాచాలుడు ధూమ్రాక్షుడు భస్మమాయెను

అతని యనుచర గణములు నాయుధ వర్షము గురిసెను
స్వాతీ గతుడగు శుక్రుని రీతి మాతపై

దేవీ వాహన సింహము తీవ్రాకృతి గర్జించుచు
జూలును విదిలించి రివుల జొచ్చి కలచెను

కొందరి రక్తము ద్రావెను కొందరి నఖముల జీల్చెను
కొందరి పాదంబులతో గొట్టి చంపెను

కొందరి శిరములు తరిగెను కొందరి కరముల విరిచెను
కొందరి ప్రేవుల చిందర వందర జేసెన్

కినుక బూని యా వాహన కేసరి సైన్యము జంపిన
దెండిన వన మగ్ని దేవు డేర్చిన రీతిన్

కమల వనము జొచ్చి పేర్మి గలచెడు గజరాజునట్లు
గజ విరోధి యా వాహిని గలచి వైచెను

హతశేషులు చని దానవ పతి కెరిగింపగ నాతడు
మృతధారల హుతవహునటు లతిగ జ్వలించెన్

కటము లదర శుంభు డపుడు కన్నుల నిప్పులు రాలగ
చండ ముండులను బిల్చి ప్రచండత బలికెన్

"బహుళ సైన్య వివిధాయుధ సహితులరై చనుడు దుష్ట
సింహమును వధించి దేవి చెరగొని రండు

ముందల బట్టుక ఈడ్చుచు ముదితను గొనిరండు - కాక
నాయుధముల ప్రహరించుచు నతివను దెండు

శీఘ్రముగా మీరటు జని సింహమును వధించి తెండు
కేశాకర్షణ విహ్వల నానతి "ననెను"

చండముండ దైత్యులంత చతురంగ బలంబు గొనుచు
ప్రగల్భములు బలుకు కొనుచు వయన మయ్యిరి

చిరునగవుల తెలివెన్నెల గిరి శోభకు మెరుగిడ హిమ
శిఖరి కొలువు దీరి యున్న చెలువను గనిరి

కౌశికి దానవ వీరుల కంట బడిన వెను వెంటనె
యాయుధముల వినరసాగి రంబిక పెనన్

అరుల జూచి యంబ క్రోధ మంద మోము మషీవర్ణ
మై కరాళ దుర్నిరీక్ష్య మై జ్వలించెను

బాన్వత్ భ్రుకుటీ స్ఫూర్జిత ఫాల బాగమున కాళిక
యుల్కాళని పుంజమట్టు లుద్భవించెను

అతి భైరవ, శుష్కమాంస యసి పాశిని ఘోరరూప
జ్వాలత్రోక్కద రక్త నేత్ర ప్రళయ రూపిణి

ద్వీపి చర్మ పరీధాన దీర్ఘ ముండ మాలిని షన
ఖట్వాంగ ప్రశస్త హస్త కాల రూపిణి

దంష్ట్రిక కా కరాళ రూప దంత కాంతి దుర్దర్శన
విస్తారిత వదన కుహర వికృతాకృతి యై

జిహ్వా చాలన భీకర శివా సహస్ర నినాదిని
నాదా పూరిత దిజ్మ్రుబ నాశ రూపిణి

పెను నాలుక వ్రేలాడగ తన కోరలు బయట బడగ
గుహను బోలు నోరు తెరచి కొని వచ్చినది

ప్రావృడ్జలదరగర్జా ద్వానంబుల వలె కాళిక
సింహనాద మొనరింపగ చెదరి రసురులు

ఖట్వాంగము ఝళిపించుచు గగనం బార్వగ నరచుచు
మించి వచ్చు నసురుల భక్షించ సాగెను

పర్వత వివరము బోలిన వదన గహ్వరమును దెరువ
మిడుత లగ్ని బడిన యట్లు బడిరి రక్కసుల్

కోరలతో నమలు చుండు ఘోర రావమున గుండెలు
జారగ నసురులు దిశలకు పారిరి భీతిన్

కరుల రదంబుల నాశ్విక వరులను గుంపులు గుంపులు
నొక్క పెట్ట మ్రింగ సాగె నుగ్ర రూపయై

జలధి జేరు నదుల యట్లు చతురంగ బలంబు లెల్ల
వడి వడిగా కాళినోట బడి యడగినవి

జలది పొంగి సమీపమున గలనగరము ముంచి నట్లు
కాళి సర్వ సైన్యములను కబళించినది

భూకంపము లోన నగరములు నశించి పోయి నట్లు
కాళి వదన మంద సురులు కలిసి పోయిరి

విలయ చండ మారుతములు విద్యుద్దండములు నగ్ని
పర్వతములు ప్రళయాబ్ధుల వలె చెలరేగెన్

ప్రళయ వేళ నృత్యహేల ప్రదర్శించు మృత్యువట్లు,
కదలిని మంధరమునట్లు కదలె కాళిక

తిమిగ్రాహ ఝషా కీర్ణ సముద్రమును కుంభ భవుడు
ద్రావినట్లు సైన్య జలధి ద్రావె కాళిక

తన పరివారమును కాళి క్షణమున దిగమ్రింగి వేయ
చండు డపుడు వెరగు పడుచు క్షణము నిలిచెను

చండ కోపమున చండుడు గండు మిగిలి మండి పడుచు
దండ ధరుని కరణి చక్రతతుల వేసెను

అంబుదములు జొచ్చు సూర్య బింబములన ససుర వైచు
చక్రంబులు కాళి నోట నమసి పోయెను

చండు కేశములను బట్టి చరచరమని ఈడ్చి కాళి
ఖడ్గంబున వాని శిరము ఖండించినది

చండుడు బడుటను చూచిన ముండుడు చండిక దాకగ
కాళి వాని శిరము గూడ ఖండించినది

చండాసుర ముండాసుర ఖండిత శిరములను బూని
కాళిక వేడుమె కౌశికి కడకేగినది

దేవి వెంత "చండ ముండ దితిజులనే వధియించితి
శుంభ నిశుంభుల జంపుట యంబ నీవని"

అనగ దేవి "చండ ముండులను వదించి నావు గాన
'చాముండి' యనంగ నీవు జగతి వెలయుము"

అని వచించి కౌశికి శీతాచలమున విహరించుచు
సురవైరుల రాకకెదురు చూచు చుండెను

సైన్యసహితముగ బోయిన చండముండు లట్లు బడగ
శుంభుడాగ్రహమున మంత్రిజూచి ఇట్లనెన్

' కంబులు కోట్యసురవరులు కాలక దౌహృద మౌర్యులు
కాలకేయ దూమ్రులివుడు కదిలి రావలె

ఆయుదములు బూన నేర్పు నఖిల లోక వాసులైన
యసురు లెల్ల నాహావమున కరుగ వలయును

క్రుద్ధ బుజంగము లట్టులు గుహల వెడలు సింగములటు
నరణి నగ్ని కణములట్టులసురులు రండు

మహా ప్రళయ జలదములన మహాసురులు తరలి రండు
నిరామరముగా విశ్వము నేడొనర్తము

దావానల కీలల వలె దానవతతి వెడలి రండు
సుడి గాలుల వలె కౌశికి చుట్టు ముట్టుడు

ప్రళయవేళ గిరుల ముంచు జలదులట్టు మన సైన్యము
కౌశికిని నవాహనముగ కబళింప వలెన్

ఎన్నియొ రణములు గెలిచిన ఈ దానవ వీరకోటి
యొక్క యాడుదాని నెదిరి యోర్వ జాలదే

పటహంబులు శంఖంబులు పటు తరముగ మ్రోగింపుడు
పడతి తోడ యుద్ధ మిపుడె ప్రకటింప వలెన్

ప్రస్థానోచిత బేరీ ఝాంకారము లద్రి తటుల
మారు మ్రోయ మ్రోగింపుడు శూర నివహాముల్

ఖడ్గంబులు ఝళిపించుచు కదలి రండు వెల్లువలై
వీరాలాపము లాడుచు చేరి నడువుడు

సంపదలను గొని యమరుల సజీవముగ విడిచినాము
నిర్జరులను నేడు బట్టి నిర్జింప వలెన్ ''

అనుచు దనుజ చక్రవర్తి యాన లిడగ క్షోణీతలము
గ్రక్కదలగ వచ్చిచేరె రక్కసి బలముల్

రక్కసుల నమీకరించి రణ భూమికి వారు రాగ
జ్యాస్వనమున నంబిక యుది గంతము నింపెన్

అపుడు రక్కసుల హరింప హరి హరాదులైన సురల
శక్తులెల్ల దేవి జేరె నమర భూమిని

వాహనములు భూషణములు వరాయుదములను దాలిచి
వనితా రూపంబులతో ననికి వచ్చిరి

బ్రహ్మాణి యనంగ వచ్చె బ్రహ్మ శక్తి కమండలము
నక్షమాలయును దాలిచి హంస నెక్కియు

ఉరగ భూషణములు దాల్చి యుగ్ర శూలపాణి యగుచు
వృషభ వాహనమునను మాహేశ్వరి వచ్చెన్

శంఖ చక్ర శార్ఙ్గ పాణి జలద వర్ణ గరుడగమన
విష్ణుదేవు శక్తి వచ్చె వైష్ణవి యనగ

నెలవంకల వలె ఓదంష్ట్రలల బలు కాంతులు వెలుగ మహిష
వాహనమ్ము నెక్కియువా రాహి వచ్చెను

వేనవేల కన్నులతో వెల్ల ఏను గెక్కి వచ్చె
నింద్రు శక్తి వజ్రపాణి యైంద్రి యనగను

శక్తిని దాలిచి వచ్చెను షణ్ముఖుని విశిష్ట శక్తి
మయూర వాహనమున కౌమారి యనగను

జూలును విదిలించుటలో తూలు చుండ తారలెల్ల
నఖ దంష్ట్రలు మెరయ వచ్చె నారసింహియు

వదన గహ్వారమును దెరచి చదలు దిక్కులదర గర్జ
లిడుచు పుడమి వడక కాళి నడచె తోడుగా

సురల శక్తులిట్లు తనను పరి వేష్టింవగ కౌశికి
రణ కౌతూహల మతియై రౌద్ర మూర్తియై

మేరు శిఖరి విడిసి యుండె, నారణ సంరంభంబును
గాంచి మహేశ్వరుడు దేవి కడకేతెంచెన్

హరుడు మాతృ గణము గాంచి 'యఖిల లోక కంటకులగు
నసురాళిని నా ప్రీతిగ హతమొనర్పుడు''

అని నుడువగ నా కౌశికి తను కోశము నుండి యొక్క
యుజ్వలాంగి కనులు చెదర నుద్భవించెను

శివుని జూచి దైత్యాదము చెంతకేగ వలయు దేవ!
వారి తలపు లెరుగ వలయు పలుకు మిట్టులు

అసువులపై నాశయున్న నమర రాజదాని వీడి
పారి పోయి బ్రతుకుడింక పాతాళములో

బాహు బలము, వరబలమ్ము, బహుళ సైన్య బలము దలచి
మదము నంది వత్తురేని తుద ముట్టింతున్

మీదు మాంస ఖండములను మెసివి తృప్తి నంద గలవు
మా పరివారపు నక్కలు - మరలి తరలుడు

అమరావతి సురరాజుకు హవిస్సులను దేవతలకు
నప్ప జెప్పి పాతాళము కరుగ వలయును

అటుగా కున్న రణస్థలి నందరి మదమణచి వైతు
ననుచు బలుక వలయు దేవ యరిగి రమ్మ' నె

న్స్వయముగ శివునే దూతగ పంపించిన యా దేవికి
'శివదూతి యటన్న పేరు స్థిరమై నిలిచెన్

హరుడు రాయబారి యగుచు నరిగి శుంభ నిశుంభులకు
కౌశికి యా సందేశ క్రమము వచించెన్

శివుడు వచించిన హితవులు చెవిటికి నంకూదినట్లు
చవిటి నేల బీజమట్లు చనె వ్యర్థంబై

శివుని సంధి నియమము పెడ చెవి బెట్టి యహంకరించి
యుద్ధమునకు తరలి వచ్చె నుద్ధతు డగుచు

చెలియలి కట్టకు నురికెడు జలది తరంగము లట్టులు
అంబికా గణముల ముట్టె ననుర దళములు

నైఋతాంబుదములట్టులు వారు విశిఖ వృష్టి గురియ
కౌశికి మార్గమున వాని ఖండించినది

తన కమండలమున నీరు దనుజులపై ప్రోక్షించుచు
బల వీర్యములను హరించె బ్రహ్మ శక్తియు

ఖట్వాంగముతో మోదుచు కదన రంగమున చరించి
కనుపించిన దితిజ తతుల కాళి మ్రింగెను

చక్రముతో శ్రీవైష్ణవి, శక్తి బూని కౌమారియు
శూలముతో మాహేశ్వరి, జొచ్చి తాకిరి

ఐంద్రి కులిశ పాతనమున నను రాళి కకావికలై
భయభ్రాంతు లగుచు దిశల బరవ సాగిరి

వారాహియు చక్రదార వధియించుచు దంష్ట్రలతో
శత్రుల జీల్చుచు కొట్టుచు సమరము చేసెన్

గర్జనముల దిక్కులదర కరమాతమ్ముల
నఖములతో జీల్చి మెసెవె నారసింహియు

గైరిక ధాతు జలమ్ముల ఏరులు గల గిరులట్టులు
దైతేయ,ని కాయ కాయ తతులు గూలెను

అట్టహాస మోరరావ మంబరమున మారుమ్రోయ
శివదూతియు దనుజుల భక్షింప సాగెను

మాతృ గణము లిట్లు రేగి మ్రంద జేయ నసురు లెల్ల
వెన్ను జూపి రణరంగము విడిచి పరచిరి

వేటగాడు వేయ పక్షి వితతి బెదరి చెదిరినట్లు
పలాయనము జెందినారు భయ భ్రాంతులై

రక్త బీజ దనెడు వాడు రాక్షసులకు కలుగు పాట్లు
చూచి మాతృగణము తాను జొచ్చి తాకెను

వాని రక్త బిందు వొకటి వసుధ పైన బడిన యంత
వాని యట్టి వీరాసుర వరుడు బుట్టును

ఐంద్రి వజ్రమెత్తి మొత్తె నతని యురము నందు, రక్త
మపుడు నేల బడ జనించె నసు రౌఘములు

మాతృగణము చుట్టు ముట్టి మాను షాదు గాయపరుప
భూమి బడిన శోణితమున బొడమి రసురులు

రక్త బీజ రక్తజనిత రాక్షసులు సహస్రములుగ
నవని నిండ ముదము నంది యార్చి రసురులు

గగన వీధి నిలిచి ఘోర కదనము వీక్షించు సురలు
భయము నంది దేవదేవి బ్రస్తుతించిరి

ఆ యసురుని మిడిసిపాటు యమర వరుల వెరగు పాటు
జూచి - దేవి కాళివంక జూచి ఇటనె

"వదన గహ్వరమును దెరచి వాని రక్త మవని బడక
యాస్వాదించుచు చరించు మా చాముండీ'

అనగ కాళి బీషణమగు నాస్య వివరమును దెరచెను
గణ తాడనమున స్రవించు క్షతము త్రావెన్

శరీరమున రుధిరమెల్ల స్రవియించగ రక్తబీజ
దనుజుడు నీరక్తుండై దరణి గూలెను

సంకల్పము లెల్ల యడగి సంసిద్ధిని బొందు యోగు
లట్లు సురలు వాని హతికి హర్షమందిరి

వె వెలుంగు బొడ తెంచగ వెలవెల బారి యదృశ్యము
నందు తారలట్లు బోయి రసుర వీరులు

ప్రబంజనము దాకి తరు ప్రచయంబులు గూలునట్లు
ఘోరాకారులు దనుజులు గూలి రచ్చట

దనుజ రక్తమాని మాతృ గణములు భీభత్స నృత్య
మాడసాగె మదపరవశమై రణంబున

నిహతశేష ఘోరసైన్య సహితు డగుచు దేవిదాకె
శుంబ దైత్యుడనుజు డౌని శుంబ సహితుడై

ఇరువంకల బలు వీరులు పరివేష్టింపగ మదమున
శుంబ నిశుంబులు దేవిని చుట్టు ముట్టిరి

మేఘమ్ములు గురిసినట్లు మృత్యు సమ శరమ్ము లేయ
త్వరిత గతిని వాని ద్రుంచి వైచె సంబిక

జింక పిండుపై గవిసెడు సింగము క్రియ నా యంబిక
రిపు సందోహము పైచెల రేగ సాగెను

కౌశికికి నిశుంభునకును కదనము ఘోరంబాయెను
నిరాయుదుడై మూర్ఛిలి నేల గూలెను

అతని పాటు జూచి శుంభు దౌడు గరిచి
నష్ట భుజుండై రదియై యంబను దాకెన్

శత్రురాక జూచి దనుష్టంకారము గావించుచు
శంఖము పూరించె దేవి జగతి వణకెను

కౌశికి ఘంటారావము కర్ణబేరి వ్రయ్యజేయ
భయభ్రాంతులై యసురులు పారిపోయిరి

సింగము గర్జింపగ మా తంగంబులు మదజలమ్ము
స్రవియించుచు బరుగెత్తగ సాగె నచ్చట

గగనమునకు నెగిరి దూకి కాళి భూమిపై జరచెను
ఆ శబ్దం బన్యస్వన మణిచి వైచెను

శివదూతి మహాట్టహాసమువని నిండ గుండె జారి
ప్రాణము లరచేత బెట్టి పారి రసురులు

గోపాలుడు కినుక బూని గోగణమ్ము వెంట దరిమి
మోదినట్లు రక్కసులను మోదె నంబిక

"ఓ దురాత్మ ! నిలువు నిలువు ముక్కడంతు నిన్ను ననుచు
దైత్యనాథు వెన్నంటుచు తరిమె నంబిక

సునిశిత మగు శూలంబున శుంభు నురము నందు బొడువ
వుడమిని బడి యాదైత్యుడు మూర్ఛ వోయెను

అంతలోన మూర్ఛ దెలిసి యాని శుంభుడేగు దెంచి
యపరి మితాయుధములతో నంబిక నేసెన్

కామ రూపుడై సహస్రకరుడై దేవిని దాకెను
చక్ర సమూహముల గప్పి సమరము చేసెన్

దుఃఖ దూర దుర్గ వాని దోర్గిలను ఖండించెను
గదగైకొన త్రుంచి వైచె ఖడ్గ దారతో

దేవి త్రిశూలమును బూని దితిజు నురము నందు బొడువ
వుడమి పైన నచల మట్లు బడె నిశుంభుడు

తచ్ఛరీర మందు దగ్గ దైత్యు డొకడు బుట్టి రాగ
శిరమును ఖడ్గమున దేవి చేదించినది

శుంభు దంత మూర్ఛ దెలిసి సోదరుడు రణాన బడుట
నెరిగి కోప మంది దేవి నిట్లు దూరెను

"చక్రవర్తినైన నేను నన్నిధికిని బిలిపింవగ
శాననమ్ము ధిక్కరింప క్షమియించితిని

ఎవ్వరైన దూతను వదియించుదురా? ప్రాక్తనమగు
నంప్రదాయమును మీరగక్షమియించితిని

తొలుత నీవు దూతయైన ధూమ్రాక్షుని చంపినావు
కావరమున - కాని నిన్ను క్షమియించితిని

నీ వాహనమగు సింహాము మా వాహిని కసిమ నంగ
కనియు యదువు జేయకున్న క్షమియించితిని

పెను భూతము బంపితి మా యనుచరులను బట్టి మ్రింగె
శమము బూని నిన్నప్పుడు క్షమియించితిని

మిత్రుల చండుని ముండుని మృత్యువు కతిధిగ బంపితి
చంపదగును నిన్ను కాని క్షమియించితిని

నా యెదుటనె నాసేనల నీ యను చరగణము చంపె
నవానము వహియించి ఎట్లో క్షమియించితిని

అనుగు హితుని రక్తబీజు తనువున రుదిరమ్ము ద్రావి
యమానుషముగా వదింప క్షమియించితిని

నీ గణములు తోచినట్టు లాగడములు చేయుచుండ
సైన్యంబుల నంహారింప క్షమియించితిని

నా రెండవ ప్రాణమైన నాసోదరు బొరిగొంటివి
క్షణమైనను విన్నిటుపై క్షమియించుదునా?

అబల వనుచు దయ దలచగ నతిశయించి పోవు చుంటి
వింక నిన్ను వదలను క్షమియించను - నిజము

ఫాలాక్షుండగు రుద్రుడు, వజ్రపాణి దేవేంద్రుడు
స్వయంభువుడు, చతుర్ముఖుడు, బ్రహ్మ, వచ్చినన్

చతుర్భుజుడు చక్రపాణి స్వయముగ హరి ఏ తెంచిన
నిన్ను నేడు రక్షింపగ నేరరెవ్వరు

నిన్ను- నీకు తోడు వచ్చు నీ చామర కోటినెల్ల
నీరు చేసి సోదరునకు నీరు వదలెద ''

అనగ దేవి ''నను క్షమించునంతటి ఘనుడవు నీవా?
నీ క్షమయును నీ కోపము గణింతునా?!

గరిమయు లఘిమయు నేనే కలిగింతును వస్తుతతికి
చరాచరములందు సర్వశక్తులు నేనే

అమరుల యధికారమ్ముల నాక్రమణము చేసినావు
సృష్టి నియమములను మీరి దుష్ట బుద్ధివై

ఎల్లర సద్వస్తు తతులు కొల్లగొట్టి నీకోశము
నింపి నాడవవరాదివి నిన్ను శిక్షింతున్

అల్పుడైన నిన్ను జంప నన్యుల సహకార మేల
వీపు చక్కనై నిలబడు వెరచి పరవక''

అనశుంబుడు తీవ్రకోప మాననమున తాండవింప
నపర నంద్య నర్కు నట్టులై ఇట్లనియెన్

''ఏమి బాహుబలము నీది ఎందరెందరో సహాయ
మేగుదెంచి రణము సల్ప నెగిరివడెదవు ''

అనగ దేవి మందహాస మంకురించి మోము వెలుగ
అసుర నాదు శుంబు జూచి యనియె నిట్టులు

"జగము లెల్ల వ్యాపించుచు స్థావర జంగమములలో
నున్న నేను గాక నింక నొరు లెవ్వరిరా?

మాతృ గణము దివ్యమైన మద్విభూతి నుండి పుట్టి
చొచ్చి లీన మగును నన్ను జూడు మిప్పుడు"

అనగ సప్త వర్ణరుచులు సర్వ కిరణ మందు లీన
మైన యట్లు మాతృ గణము లంబ గలిసెను

"ఒక్క రూప మంది యుంటి నుక్కడంతు నిపుడు రమ్ము
నీకాయువు మూడినదీ నిమేషంబున

అనుచు వాని దాకి యుగ్రమైన రణము సలిపె దేవి
యద్భుతమున జూడసాగి రమరులు దివిని

పిశా మహానుగ్రహానం చితాస్త్ర విదుండగు శుంభుడు
వరమాస్త్రములంబికపై ప్రయోగించెను

అఖిల మంత్ర వాచ్యయు, సర్వాస్త్ర స్వరూపిణి కౌశికి
దాకి యడగె జలధి వర్షధారలట్లవి

ఉగ్ర నిశిత శూలముతో నురము నందు నాటె దేవి
వజ్ర హతాచల మట్టులు వాడు గూలెను

ద్వీప సహిత మగుచు భూమి దిద్దిరమని సంచలించె
ఘోర ధ్వానములు నిండె కులగిరులంటన్

ఉడు వీధిని దోచుచున్న నుల్కలెల్ల శమియించెను
అగ్నులు శాంత జ్వాలల నపుడు వెలిగెను

అతుల మారుతములు వీచె, నంబరమున గ్రహతారక
సముదాయము సముదయమున స్వచ్ఛత వెలిగెన్

అగ్ని పర్వతములు తొలిగె, నడవి జంతు భయము తొలిగె,
నదులు మార్గ మందు పారె, నరులు తనిసిరి

గంధర్వులు కమ్మనైన కంఠంబుల నంబ కీర్తి
గానమ్మును సల్పినారు వీనులలరగా

దేవ దుందుభులు మ్రోగెను, పూవుల వానలు గురిసెను,
అప్సరసలు నాట్యమాడి రంబ బొగడుచు

సురలు నవ్య పారిజాత తరుల వరులు విరుల కరము
లందు బూని జగన్మాత నాశ్రయించిరి

దుస్తరమగు వరములతో దోర్గర్వమున జగంబుల
నేచిన శుంభ నిశుంభుల నీశ్వరి చంపన్

వికసిత ముఖ కమలమ్ముల సకల దిశలు చెలువందగ
నగ్ని దేవు మున్నిడు కొని యమరులందరు

భక్తి నమ్ర మూర్తులగుచు ప్రాంజలి నంతర్ముఖులై
యాగమ రీతి సరస్వతి నంబ బొగిడిరి

"ఆర్తి హారిణీ ప్రసీద। అఖిల విశ్వనాయికవై
చరాచరములను గాచెడి జనని। ప్రసీద

అవని యగుచు నఖిలమునకు నాధారముగా నిలుతువు
భూత సమితి నీయందే బొడమి నిలుచును

జలములగుచు తృప్తి పరతు సర్వభూత సంఘములను
నాప్యాయము నార్ద్ర తయును నమృత మయముగా

వేద జనని। నీవనంత వీర్యవు పరమాయవు శివ।
విశ్వబీజ భూతమైన వేల్పుటమ్మవు

విశ్వమెల్ల వ్యాపించిన విష్ణు శక్తి వీవె దేవి।
మమతల బ్రేరేపించెడు మాయవు నీవే

అనుబంధము పెంచి జీవులను మోహములో ముంతువు
మరి యొకపరి మోక్ష మిచ్చి కరుణ జూతువు

నీ యంశమె స్త్రీ _లందరు నీరూపమె విద్యలెల్ల
నీవే జగములు నిండగ నెట్లెన్న దగున్

భూత సర్వ రూపిణివై భుక్తి ముక్తి నొసగు దేవి
పరా పరోక్తియు నీవే ప్రాణ శక్తివి

జనుల హృదయ మందు బుద్ధి యనగ నుండి స్వర్గ మోక్ష
ముల నొసంగు నారాయణి ! మ్రొక్కుల గొనుము

కలయును కాష్ఠయుననగా కాలనియతి, పరిణామము
లయము గూర్చు నారాయణి ! దయను జూడుము

సర్వకామితముల నిచ్చు సర్వమంగళా! శరణ్యా!
త్ర్యంబక! శివ! నారాయణి ప్రార్థించెదము

సర్వ మంగళమాంగల్య! సర్వార్థప్రద!త్ర్యంబక
శరణ్య! శివ! నారాయణి సంస్తుతింతుము

సృష్టి స్థితి లయాదులను జేయు శక్తిగల గుణమయి!
సనాతనీ! నారాయణి! సంస్తుతింతుము

శరణాగత దీన భక్త పరిత్రాణ పరాయణా!
ఆర్తి హారిణి! నారాయణి! ప్రార్థించెదము

కౌశాంబఃక్షరిక! శత్రు క్షయ కారిణి! హంస గమన!
బ్రహ్మాణీ! నారాయణి! ప్రార్థించెదము

సర్పహార! శూలపాణి! చంద్ర మకుట! వృషవాహన!
మాహేశ్వరి! నారాయణి మహిమ లెంతుము

కుక్కుటాంక! వర మయూర కులవాహన! శక్తిహస్త!
కౌమారీ! నారాయణి! ప్రేమ గొలుతుము

శంఖ చక్ర శార్ఙ్గపాణి ! సకల దైత్య సంహారిణీ !
వైష్ణవి ! శ్రీనారాయణి ! ప్రార్థించెదము

అవనీ భారమ్మును దంష్ట్రాగ్రమ్మున నిలిపిన శ్రీ
వారాహీ! నారాయణీ ప్రార్థించెదము

ఉగ్ర రాక్షసులను జంపు నుద్యమమున జగతిగాచు
నారసింహీ! నారాయణీ! కోరి కొలుతుము

వజ్రపాణీ! ఐరావత వాహనా! సహస్రనేత్ర
ఐంద్రి! దేవి! నారాయణీ ప్రార్థించెదము

ఘోర రూపమునను ఘోర ఘోషణముల రిపుల నరచు
శివదూతీ! నారాయణీ! సేవించెదము

దంష్ట్రికా కరాళ! ముండదమని! ముండ మాలిని! శివ!
చాముండీ! నారాయణీ నంస్తుతింతుము

లక్ష్మియు విద్యయు శ్రద్ధయు లజ్జయు స్వధయును ధృవయగు
మహారాత్రి! నారాయణీ! మహిమలెంతుము

మేధ సరస్వతి! తామసి! ఆదిభూతి! దైవశక్తి!
అఖిలేశ్వరి! నారాయణీ! ప్రార్థించెదము

సర్వరూప! సర్వేశ్వరి! సర్వ శక్తి యుక్త! భయము
బాపు దుర్గ! నారాయణీ! ప్రార్థించెదము

ప్రసన్నమై మూడు కనుల బాసిల్లెడు నీముఖ మమ
జాలము బోకార్చు గాక సర్వమంగళా!

జ్వాలా భీషణ మాసుర సంమ హారము! భక్త శుభద
మగుశూలము మముగావగ ప్రార్థించెదము

జగముల నాదము నింపుచు శత్రు పరాక్రమము బాపు
గంట కన్న తల్లి పోలె గాచు గావుతన్

నీవు తృప్తి నంది తేని నిఖిల శుభంబులు గలుగును
పాపంబులు తొలగి పోవు నాపదలడగున్

ఆశ్రయించు భక్త జనుల కాపద లెన్నడు గలుగవు.
అశేష శోకాళి నణచి యాదరింతువు

ధర్మ మార్గదూరులైన దైత్యుల హరియింప వివిధ
మూర్తుల ధరియించి యుద్ధమును జేసితివి

శాస్త్రములు, వివేక దీప జాలము వెలిగించు విద్య
లన్నియు ను త్వదీయ రూపు లంబ! చండికా!

మమతాహంకారములను మదిలో నుదయింపజేసి
మోహాతమము నందు జగతి ముంచి యుంతువు

జలధి పొంగి వచ్చినపుడు శత్రు జనులు ముట్టి నపుడు
కార్చిచ్చులు నలు దిక్కుల గ్రమ్మి నప్పుడు

చోరులు చొరబడి నప్పుడు ఘోరాహులు తరిమి నపుడు
వరో రక్షింపగ నీవే భద్రకాళికా!

జగముల బాలించెడినో జగదీశ్వరి! నిన్ను గొలువ
జగముల గాపాడంగా శక్తి జనించున్

నీవ కాదు, నిన్ను గొలుచు నిర్మల చరితులు జగతికి
శరణ్యు లౌదురు దేవీ! నంస్తుతింతుము

ఇప్పటి వలెనే మమ్ముల నెప్పుడు గాపాడ వమ్మ!
పాతకోత్పాతములను బాపుము మాతా!

విశ్వార్తిని హరియించెడు విశ్వమాత! ప్రణతులైన
మము కరుణా దృష్టి గాంచు మా! వరమిమ్మా ''

అనినదేవి కరుణతోడ ''నవనికి నుపకారమైన
వరములిత్తు వేడు'' డనగ సురలు బలికిరి

''అఖిల జగము లార్తిబాసి సుఖశాంతుల నంద వలయు
శత్రుజనుల నిట్లె నీవు చంప వలయును''

అనగ దేవి సురల జూచి యాదరమతి ననియె నిట్లు
"సురలారా! మీకోరిన వరము లిత్తును

మరియొకపరి వైవస్వత మన్వంతర కాలమందు
నష్టా వింశతి యుగమున నవతరింతును

అసురులు శుంభ నిశుంభుల యంశంబున జనియింతురు
ఎల్ల సుజన కోటి బట్టి ఏచు చుందురు

నంద గోపు దివ్యకులము నందు యశోదకు జనించి
యాదుష్ట జనాళి బట్టి హరియించెదను

వింద్య పర్వతమున నందు 'వింద్యావాసిని' యనుచును
ప్రజలెల్లరు నన్ను గొలిచి ప్రస్తుతింతురు

వేరొకపరి దనుజతతులు విప్రచిత్తి వంశీయులు
ప్రజాకంటకులు జగతిని ప్రబలి యుందురు

రౌద్ర రూపమును దరించి రాక్షసతతి మ్రింగి వైతు
'రక్త దంతి' యను నామము ప్రబలు నప్పుడు

అవనిని శత వర్షంబులు ననావృష్టి గలుగ మునుల
స్తోత్ర ఫలముగా జనింతు ధాత్రి యందున

మరల వృష్టి గురియు వరకు మత్ శరీర జనిత శాక
ముల నాహారము జేతును మునివర్యులకు

శతనేత్రంబుల గాచుట జనులు 'శతాక్షి' యందురు
'శాకంబరి' యనుచు నన్ను నంస్తుతింతురు

దుర్గమ రాక్షసు జంపుదు 'దుర్గ' యనగ యశము గొందు
హేమ శిఖరిపై వసింతు 'బీమ' యనగను

రాక్షసు నరుణుని జంపగ భ్రమర రూపమును దరింతు
'భ్రామరీ' యటంచు నన్ను బ్రస్తుతింతురు

అట్లె జగతి యందు నెవ్వ రసురులు జనియించిన నే
నార్తి బాపి బ్రోచు చుందు నరుల జంపుదు

సాధుల రక్షించి దుష్ట జనుల నడచి ధర్మ దీప్తి
నవని నిలువ ప్రతి యుగమున నవతరింతును

ధర్మమునకు హానిగా నధర్మము చెలరేగు వేళ
ఆయధర్మమును హరింప నవతరింతును

ఈ చరిత్ర భక్తి మీర నెవ్వరేని పఠియించిన
నిహపర సుఖమ్ములు వారికి నిచ్చు చుందును''

అనుచు దేవి మాయమయ్యె నమరులు దేవి నుతించుచు
తమ తమ లోకముల నంది తాము నరిగిరి

తమ తమ యధికారములను తాము బొంది యజ్ఞభాగ
మాహరించి సంతసించి రమరు లెల్లరు

నిహతశేషులైన దైత్య నివహంబులు పాతాళము
నందు నణిగి యొదిగి యుండి రధిక భయముతో

రూప రహిత యయ్యు దేవి బాపుల బరిమార్ప జగతి
వ్యక్త రూపయై జనించి వసుధ వెలయును

ధాత్రి భూతజాలమందు తానె వివిధ గుణములగుచు
హృదయ వర్తనమ్ము నడుపు నీశ్వరి ఎపుడున్

మమత లనెడు బంధనముల మనసును బంధించి వైచు
మోహ సంద్రమున జీవుల ముంచి యుంచును

సృష్టి నలుపు వేళ తానె స్రష్టయగును లయకాలము
నందు మహా మారి యగున దాదేవతయే

శుభము కలుగు కాలమందు శుభము లొసగు నా ప్రకృతియె
యశుభ కాలమందు తానె యలక్ష్మి యునగు

సకల భూత తతి తోడను సఖ్యత పాటింప వలయు
దయయును సత్యము శౌచము దాల్ప వలయును

సాదు సంగమమ్ము నంది సచ్చరిత్ర లరయ వలయు
జగమును దేవీ మయముగ సందర్శింపవలెన్

తనదు గుణము నెరిగి, తదను గుణమగు వృత్తిని గ్రహించి,
మనో వికల్పమును మాని పని చేయవలె

లాభాలాభము లెంచక, లభియించెడు దాని తోడ
తనివి నొంద మనశ్శాంతి తప్పక కలుగున్

క్షితిజము పై నక్షత్రము జేరు కొనగ నలయు నట్టు
లాశల మృగతృష్ణలకై యలయగరాదు

తలపుల, మాటల, చేతల, ధర్మ మార్గమున నడుచుచు
ఫల మాసింపక కర్మల సలుప వలయును

'సర్వమునకు దేవి దివ్య సంకల్పమె కారణమ'ని
దలచి కలత మాని యుండ వలయు నెప్పుడు

ప్రతి యాత్మయు పరిణామ క్రమ గతి ముందుకు సాగును
రయము గూర్పవలయు జీవి ప్రతి జన్మమునన్

ఏ విషయము గ్రహియించిన జీవాత్మకు ప్రగతి గలుగు
నెంచి యట్టి విషయ మభ్యసించ వలయును

నశ్వరమగు జీవితమును శాశ్వతమగు కర్మలతో
సార్థక మొనరించు కొనుట జనుల కుచితము

సకలేంద్రియ పటుత్వమును సమ్యక్ జ్ఞానము బడయగ
వినియోగించిన నాత్మకు వికాస మొదవున్

మూలాదారమున కమల నాళ తంతు పట్లుండెడు
కుండలినీ శక్తి మేలు కొలుపవలయును

ప్రాణాయామము సలుపుచు వాయువులను నియమించుచు
సహస్రారమును జేర్చిన స్రవించు సుధలన్

ఏ నామము జపియించిన నే విధమున నర్చించిన
యా పగిది ననుగ్రహించు నాది శక్తియే

గగన పతిత జలము జలధి గలియునట్లు సర్వదేవ
పూజనములు నారాయణి బోయి చేరును

సర్వధర్మములను వదలి శరణు జొచ్చు భక్త జనుల
నఘముల బోకార్చి కాచు నంబ కరుణతో

అన్యచింతలెల్ల వీడి యనయము పొసించు వారి
యోగక్షేమములు చూచు చుండు నంబిక

అట్లు నిత్య ప్రకృతి దేవి నర్చించెదు వారు సర్వ
శుభము లంది శాంతి నంది సుఖియించెదరు

మోహ పటలి దొలగి పోవు దేహికి నజ్ఞాన మణగు
నమలమైన జ్ఞాన మార్గ మపుడు దోచును

దేవి దివ్య చరణములను దినదినమ్ము దలుచు వారు
భవబంధము వీడి మోక్ష పథము కందురు

దేవి చరిత లరయు వారు, దేవి మహిమ వినిన వారు
మానసిక సుఖంబులంది జ్ఞానులౌదురు

ఓయి సురథ! ఓ సమాధి! యుత్తమమగు ప్రకృతి మాత
శరణు జొత్తురేని సుఖము శాంతియు కలుగున్"

అనిమేధన మునివరుండు ననుగ్రహముతో పచింప
సురథ సహాదులును జ్ఞాన మరసి పిమ్మట

సన్యసించి నదికి నేగి సైకత స్థలంబు నందు
మృణ్మయ దేవీ మూర్తుల నేర్పరించిరి

పుష్ప ధూప దీపమ్ముల పూజ నల్ప సాగినారు
నియతాహారము తోడను నిష్ఠతోడను

మూడు వత్సరమ్ము లిట్లు పూర్ణభక్తి గొలువ దేవి
చాల మెచ్చి కరుణను సాక్షాత్కరించెను

ఆ సమాధి సంగరహిత మగు విజ్ఞానము గోరగ
నాత్మ జ్ఞానమ్ము నొసగె నాది శక్తియు

సురదుడు తన రాజ్యపదము మరల గోరు కొనగ దేవి
యట్లె వరమొసంగి ప్రీతి ననియెనిట్టులు

"అన్యజన్మ మందు గూడ నవని పతిగ నుద్భవింతు
వటు పిమ్మట సుతుడవగుదు వాదిత్యునకు

అపుడు నిఖిల సురలు బొగడ నవనిని సావర్ణియనగ
మనువు వౌదు వోకుమార! తనివి జెందుము"

అనుచు వరము లొసగిదేవి తన లోకమునకు నేగెను
సురద సమాదులును దేవి స్తుతి యొనర్చిరి

ఈ కథ చదివిన జనులకు నెందును నపజయ ముండదు
కన్న తల్లి పోలె దుర్గ గాచువా రలన్

ఈగీతము బాడినచో నిహపర సుఖములు కలుగును
మానసమున భ్రాంతి తొలగు జ్ఞానము కలుగున్

దేవి దివ్య చరిత వినిన దేవీ రూపము దలచిన
చింత లెల్ల తొలగిపోవు నంతన మొదవున్

ఇందిరయె యనుగ్రహించు నిందిరయె ప్రతిగ్రహించు
నిందిర సుఖ దుఃఖదాయి ఈశ్వరి యరయన్

ఇందిరయే మోహపరుచు నిందిరయె విరక్తినిచ్చు
ఇందిరయె తరింపజేయు నెల్ల జీవులన్

దుర్గ దుర్గ దుర్గ యనిన దుఃఖంబులు తొలగి పోవు
దురితంబులు దూరమగును దుర్గ దలతును

సర్వదోష పరిహారిణీ సర్వపాప సంహారిణీ
సంసృతాబ్ధి సంతారిణీ జనని దలతును

దుష్టాసుర సంహారిణీ శిష్ట భక్త పరిపాలిని
హృష్ట హృదయ సంవాసిని నీశ్వరి దలతున్

భగవతి! దుర్గా! యనుచును పరవశించి పలుకు వారి
మానస వాసిని దుర్గా మాత దలతును''

ధర 'దుర్గా దేవీగ్ం అహాగ్ం శరణం ప్రపద్యే అలక్ష్మీ
ర్మే నశ్య తాంత్వామ్ వృణే శ్రీ'యన పలయున్

*ఇది శుంభ నిశుంభ వధ*

# అపరాధక్షమాపణస్తోత్రము

అపరాధ శతమ్ముల నలిపి యంబ చరణములు శరణం
బనిన కన్న బిడ్డలట్లు జనని గాచును

అపరాధిని శరణంటిని యనుకంపను జూపి నీదు
చిత్త మెట్టులట్లు గావు శ్రీసరస్వతీ!

భ్రాంతి, మరుపు, నజ్ఞానము గ్రమ్మగ నల్పాధికముల
నలిపితిని ప్రసీద వగుచు క్షమియించంబా

అమృత మయవు దేవి సచ్చి దానంద స్వరూపిణివి
కామేశ్వరి! జగన్మాత! కరుణా నిలయా

సదయ వగుచు మాగృహమున నలిపెడు నీయర్చనలను
పరమేశ్వరి! ప్రసన్నవై పరిగ్రహించుమీ

సర్వరూపమయవు జగత్ స్వరూపిణివి విశ్వమాత!
పరమేశ్వరి! పదసన్నిధి వందన మిడుదున్

పద మాత్రాక్షర పరనము పరిభ్రష్టమై యుండిన
నీ దయ పరిపూర్ణంబై నెగడు గావుతన్

బిందు విసర్గములు లేని వేళను పఠియించియున్న
ఎడనది గుర్తించక, నే విడిచి యుందును

భక్తిలేమి, యజ్ఞానము పరిహీనము, నవ్యక్తత
బొంది పఠించియు నుందును పొరపాటైనన్

అపరాధము లున్న పంచు నెపము పెట్టక క్షమించి
సాంగము, పరిపూర్ణముగా నలుపుము తల్లి

పారాయణ విధానమున వాటిల్లిన దోషములను
బాటింపక పరిపూర్తిగ భావింప వలెన్

ఏ సంకల్పము కొరకై చేసితినో ఈ వఠనం
బా సంకల్పము సఫలత నంద జేయుమా!

భగవతి అంబా ప్రసీద! భక్త వత్సలా! ప్రసీద!
దుర్గాదేవీ! ప్రసీద! దురిత మోచనీ!

హైన్యరహిత జీవితమ్ము ననాయాన మరణమ్మును
చివరకు తవసాయుజ్యము శివా! యొనగుమా

కాత్యాయని! కామేశ్వరి! కన్యకుమారీ! దుర్గా
భవ్య మార్గమున మమ్ముల బ్రచోదింపుమీ

ఇడాపింగళికామధ్య మృణాళీతంతు రూపి
ణీ! సహస్రార నిలయ! నిన్ను దలతును

హృదయంబున ననవరతము నుదలను స్రవియించుమమ్మ
వాఙ్మనః తనుకర్మల బ్రచోదింపుమీ

తత్సవితృ వరేణ్య భర్గ దైవతాన్య సుధీ మహిత
ధియః యోగము లనుబ్రచో దింపు మాదయన్

తత్సవితృవరేణ్య వంశ దవుని భర్గ ప్రముఖదేవ
నము పాస్యుండైన రామచంద్ర దేవునిన్

ధీమహితుని దియఃపూర్ణు స్థిరున యోని జాజానిని
మది నిలువగ బ్రచోదింపు మాగాయత్రీ

మంగళమో శారదాంబ! మగళమో పద్మనిలయ!
మంగళమో శైలతనయ మంగళ మంబా!

నీ మహిమా చంద్రి కలీ భూమండల మెల్ల ప్రజా
హృదయాకాశంబుల పూరించు గావుతన్

కాలమునకు మేఘమ్ములు గలిగియు వర్షింప వలయు
సుజను లెల్ల శుభము లంది సుఖియింప వలెన్

పశువులు పక్షులు సంతస మొసగగ జీవింప వలయు
భూమి సస్య సంపదతో పొంగార వలెన్

పాలకు లాదర్శ వృత్తి ప్రజారంజకులై సత్య
ధర్మమ్ములు నిలుప వలయు ధరపై నెపుడున్

నీ కరుణామృత వర్షము నిఖిల విశ్వమందు నిండి
చల్లని వెన్నెల పోలిక జగతి గాచుతన్

*ఓం తత్ సత్*
*దేవీ చరిత్రము సంపూర్ణం*
*శ్రీ పరమేశ్వరీ పాదార*
*విందార్పణ మస్తు*



## స్వవిషయము

నీ చరిత్ర నాచేతను నీవె వ్రాయునట్లు చేసి
నావు కరుణ తోడ తల్లి! ననుగా వగదా?

వరున వేది సోకి ఇనుము వసిడి యైన వగిది నీదు
చరిత దలచి మా బ్రతుకులు నఫలత గాంచెన్

నానుతుండు శరవణునకు నాక లోక వానమిమ్ము
మాకు మనశ్శాంతి నిమ్ము లోక నాయికా।

నర్వే వల్లి హారిప్రియ నర్వ బంధు హృదయప్రియ
కక్షయ లోకమ్ము లిచ్చి యాదరింపుమీ

అక్షరార్చనము గ్రహింపు మన్య వరము లడు గబోను
తల్లి! నరస్వతీ నీకు తనయుడగానా।

నీ కరుణను బూచిన కవి తాకునుమము లంకితముగ
నీపాదంబుల నన్నిది నే - జేర్చుటలు

అబ్ధి జలము భక్తి దోవ నబ్ధి కర్ఘ్య మిచ్చుటగును
శీతాంశో రమృతార్పణ మైతనర్చును

అల్పుడైన నాయర్చన 'అమ్మ' చరణ కమలములకు
నర్పణమ్ము చేయు చుంటి నంబిక కొనుమా।

మంగళమో నరస్వతీ। మంగళమగు నాదిలక్ష్మి
మంగళమగు శ్రీపార్వతి మంగళ మంబా।

శ్రీ మార్కండేయ పురాణంలోని 'దుర్గా సప్తశతి' దేవీ మహిమను వర్ణించే మంత్రశాస్త్రం అందలి ప్రతి శ్లోకమూ ఒక మంత్రమే ఆ గ్రంధంలో నాల్గు ఘట్టాలలో దేవీ స్తోత్రాలున్నాయి అవి భక్తిరస స్ఫోరకంగా - దేవీ తత్వాన్ని ప్రతిపాదించే విధంగా ఉన్నాయి

ఆ గ్రంధాన్ని భక్తులు పారాయణ చేస్తారు అందలి శ్లోకాలు మంత్రాలుగా గ్రహించి - జపం చేస్తారు భక్తులు తమ శక్తికీ, అభిరుచికీ అనుగుణంగా ఆ మాలా మంత్రాన్ని ఉపాసించి 'అమ్మ' కరుణనూ - ఐహికా ముష్మిక ఫలాలనూ చూరగొంటున్నారు

ఆ గ్రంధ పరనా పారవశ్యంతో
రచింప బడినదీ చిరుగేయకృతి

భగవతీ అంబా ప్రసీద । భక్తవత్సలా ప్రసీద ।
దుర్గాదేవీ ప్రసీద । దురితమోచనీ

అమృత మయపు దేవి సచ్చిదానంద స్వరూపణివి
హృదయంబున ననవరతము సుధలు గురియుమా

తత్స విత్రువరేణ్యా భర్గదైవతాస్య ! సుధీమహిత ।
ధియ: యోగములను ప్రచోదింపుమా దయన్